వనితాలోకం సీరియల్



# స్వయంసిద్ధ



## 6

అనుకున్న లగ్నానికే ఈ వివాహం యథావిధిగా జరిగిపోయింది.

సామాన్య స్థితిపరులైన ఆడ పెళ్ళివారు తమ తాహతుకి మించి బ్రహ్మాండమైన ప్రయత్నాలయితే చేశారు; కాని మగ పెళ్ళి వారుమాత్రం అంత ప్రయత్నాలేవీ చేసినట్లు లేదు. పెద్దజమీందార్లు. బంగారు వస్త్రాలు ధరించి, పెద్ద బ్రహ్మాండంగా ఊరేగింపు చేసుకుంటూ వరుడు కళ్యాణవేదిక మీదికి వస్తాడని - కలలు కన్నవారంతా నిర్ఘాంతపోయారు. పెళ్ళికొడుకు పల్లకి దిగి పందిట్లోకి రాగానే అందరూ తెల్లబోయి చూడసాగారు. అతను మామూలు జరీ అంచు పంచె కట్టుకుని, అలాంటిదే మరొకటి వల్లెవాటు వేసుకుని ఉన్నాడు. రెండు వైపులా రెండు పాదరసపుగుళ్ళు పెట్టి కట్టిన లావుపాటి పూలదండ మాత్రం ఒకటి వేసుకుని ఉన్నాడు. అదొక్కటే కన్పిస్తున్న విశేషం. పెళ్ళికొడుకుని చూడగానే 'ఛీ, ఖర్మ లేదు' అని అన్నవాళ్ళు - కొంచెం సేపయేసరికి, మగపెళ్ళివారి చెవిని పడకుండా 'పెళ్ళికొడుక్కి బుర్ర ఖాళీలా ఉంది' అని చెవులు కొరుక్కోవటం మొదలెట్టారు.

కాని పీటలమీద వధూవరులు పరస్పరం చూసుకునే శుభదృష్టి సందర్భంలో మాత్రం వరుడు కళ్ళు రెండూ ఇంతింత చేసుకుని వధువుకేసి చూశాడు. ఆ చూపులు వధువు హృదయాన్ని గాలిస్తున్నాయి. వధువు కూడా అదే సమయానికి అతడికేసి ఇంచుమించు అలాగే చూసింది. ఈ అపరిచిత వ్యక్తి—అతిపరిచితుడిలాగా తన హృదయ కవాటాన్ని తెరిచి, బాగా తనకు కావలసిన వస్తువుకోసం - దేనికోసమో వెతుకుతున్నాడా అనిపించిందామెకి. విశాలాక్షి అయిన చండి మెల్లిగా బరువుగా రెప్పలు వాల్చుకుంది.

లోపల శోభనపుగదిలో కూడా అందరూ సంశయమనస్కులైనారు. వరుడు పెదవి కదల్చలేదు. ఎవరైనా పరిహాసమాడితే అది పట్టించుకున్నట్లే కన్పడలేదు. ఆడవాళ్ళంతా చుట్టూచేరి హాస్యాలు పట్టిస్తూంటే అతని ముఖంలో నవ్వన్నమాటే కన్పించలేదు. ముత్తైదువులు పడిన శ్రమంతా వ్యర్థమయింది. అతని హృదయకవాటాన్ని మాత్రం ఛేదించలేకపోయారు. చివరికిదంతా ఎనుబోతుమీద జడివాన కురిసినట్లే అనుకుని ముత్తైదువులంతా తలోదారిని చూసుకున్నారు.

చండి అవకుంఠనంలోంచి ఇప్పటిదాకా వరుడి ముఖంకేసే చూస్తూ ఉంది. ముత్తైదువులంతా వెళ్ళిపోగానే, అవకుంఠనంలోంచి ముఖాన్ని కొంచెం బయటికి పెట్టింది. వధూవరుల చూపులు కలిశాయి.. పెళ్ళిపీటలమీదినుంచి తిరిగి పరస్పరం ఇంత దగ్గరగా చూసుకుంటున్నారే...

పెళ్ళికొడుకే ముందు మాట్లాడాడు. పసిపిల్లవాడిలాగా, "నీ పేరు చండికదూ!" అని అడిగాడు.

వరుడి ముఖతః - పసిపిల్లవాడికే ప్రశ్నలాంటి - ఈ ప్రశ్న రావటం చూసి, చండి లోలోపల నవ్వుకుని, పైకి కొంచెం పరిహాసంగా "అయ్య మా కిందాకట్నుంచీ ఈ పాఠమే వల్లించుకుంటూ కూచున్నారల్లే ఉంది!" అన్నది.

అతడు కళ్ళు రెండూ ఇంతంత చేసుకుని - అస్వాభావికంగా చూస్తూ "ఛీ, పెళ్ళి చేసుకోటానికి వచ్చేవాళ్ళెవరైనా పాఠాలు వల్లించుకుంటూ వస్తారాయేం?' అన్నాడు.

వరుడి మాటలకి చండి కనుబొమలు చిట్లించి, అతడి ముఖంకేసి తీవ్రంగా చూస్తూ "అయితే ఏం చెయ్యాలి మరి వరుడు?" అని అడిగింది.

ముఖభంగిమతో పాటు, చేతులతో కూడా అభినయిస్తూ—

"బుద్ధిమంతుడిలాగా నోరు మూసుకుని చూస్తూ కూచోవాలి" అన్నాడు.

చండి ఆ సమాధానానికి తగినట్లే వెటకారంగా "అందుకనే ఇంతసేపూ అలా కూచున్నారల్లే ఉంది. ఎవరెన్ని వేళాకోళాలాడినా కిమ్మనలేదుగా!" అంది.

"వాళ్ళు ఆడవాళ్ళుగా మరి!"

"మరి నేను మగవాడినా?"

అతడీసారి నవ్వుతూ "ఊహూ, నువ్వు నా పెళ్ళానివి" అన్నాడు.

చండి ఏమీ మాట్లాడకుండా అతడి ప్రక్కనే కూచుని రెప్ప వాల్చకుండా ఆ అమాయకుడి ముఖంకేసి చూడసాగింది. క్రూరమైన విధి తనని ఎలాంటివాడి వశం చేసిందీ తెలుసుకోటానికామెకెంతోసేపు పట్టలేదు. వెంటనే వెనకనుంచి ఎవరో వీపుమీద కొరడాతో ఛెళ్ళున కొట్టి జ్ఞాపకం చేసినట్లు - మామగారు తనకి కానుకగా బంగారపు కొరడా యివ్వటం - ఇచ్చేటప్పుడు ఆయనన్న మాటలూ అన్నీ జ్ఞాపకం వచ్చాయి. 'మాయింట్లో అలవిమాలిన గాడిద ఒకటుంది. దాన్ని నువ్వు లొంగదీయాలి. అందుకే నీకీ కొరడా'...

చండికి కనువిప్పు కలిగింది.

మరుక్షణంలోనే రాజకుమార్తె విశ్వ

(30-వ పేజీ చూడండి)

మూలం : మణిలాల్ వంద్యోపాధ్యాయ  అనువాదం : మద్దిపట్ల సూరి



"కొంచెము కొంచెముగ
మంచు ముసుగు తొలగించి
నిద్రమేలుకొంటున్న
మద్రాస్ నగరము !"



(ట్రాములున్న రోజుల్లో చెన్న పట్నం)—ఫొటో: పి. సి. ఎమ్. ఈశ్వరం బాబు.

హరికథ గుర్తుకొచ్చింది. గురువు కుట్ర వన్నటంవల్ల 'మూర్ఖకాళిదాసు'తో ఆమెకి వివాహమయింది. కాని రాజకన్య మూర్ఖుడైనభర్తని తిరస్కరించింది. ఆ తిరస్కృతుడైన మూర్ఖుడు కఠోరమైన సాధనచేసి, జయపతాకాన్ని చేతపట్టుకుని మళ్ళీ వచ్చి విద్యాంసురాలైన భార్యని ఓడించి ఆమెకి గర్వభంగంచేశాడు * తనకి అలాంటి పరీక్ష సమయమే ఆసన్నమైంది ఇప్పుడు...

చండి మాట్లాడకుండా కూచోటం చూసి, అతడు నోరంతా తెరిచి "చూడు. ఇవాళ నా కెంతో సంతోషంగా ఉంది. నిజంగా..." అన్నాడు.

చిందరవందరగా తన మనస్సును పెనవైచుకున్న ఆలోచనల నన్నిటినీ బలవంతాన సడలింపచేసుకుని "ఎందుకని?" అని అడిగింది చండి.

వరుడు చెప్పలేనంత సిగ్గుతో చేతులు నులుముకుంటూ, చండికేసి చూస్తూ — "ఏముందీ — నిన్ను పెళ్ళిచేసుకుని, నీతో మాట్లాడుతున్నాను కదూ — అందుకనే" అన్నాడు.

చండి ముఖం చాటు చేసుకుని నవ్వి, "అయితే నేను మీకు నచ్చానన్నమాట; నిజంగా నేనా?" అని అడిగింది.

"యే - ఫో...నాకు సిగ్గేస్తోంది"

"పోనీ, ఆమాట చెప్పొద్దులెండి. మరి నేను బాగా మాట్లాడుతున్నానా?"

"ఆఁ నే పుట్టాక నాతో యెవరూ ఇంత బాగా మాట్లాడలా..."

"ఏం? మీ నాన్నగారో?"

"మా నాన్న చూడగానే తిడతాడు"

"కంటబడితేనే తిడతారా? మరి మీ అమ్మ?"

"నోటితో ఏమీ తిట్టదు. కాని కళ్ళెర్రచేసి చూస్తూఉంటుంది. ఆ చూపు ఎంత భయం వేస్తుందనుకున్నావ్? అమ్మబాబోయ్! అలాంటి చూపు—"

"కోపంతోనే చూస్తారన్నమాట. అప్పేమీగా చూడనే చూడరా యెప్పుడూ?"

"ఎందుకు చూస్తారు చెప్పు. నేను మూర్ఖశిగా! మనిషిపుటక పుట్టిన గాడిదని. నాకు తెలివనే దేమీలేదు"

"మీ కేమీ చదువుకోనే లేదా అసలు?"

"ఊహూఁ. ఎలా చదువుకుంటాను? చదువు చెప్పటానికని మాస్టారు రోజూ వచ్చేవాడుట! కాని తమాషా ఏమిటంటే ఆయన వచ్చి కూచున్నట్లు ఆయన పిలకకూడా నా కెప్పుడూ కన్పించలా"

"అదేం?"

"నేను ఆయనదగ్గిరకి వెళ్ళటం మాత్ర దేనికి? నా బుర్రంతా ఒట్టి పేడముద్దట; నా కేమీ చదువు రాదుట! కాని నీతో చెపుతున్నాను. నాకు చదువుకోవాలని చాలా యిదిగా ఉంది..."

"మీ అంతట మీ కే చదువుకోలేకపోయారా?"

"ఎలా చదువుకోను? చిన్న జమీందారుగా రొచ్చి చేతులో పుస్తకాలు లాక్కెళ్ళేవాడు. 'నువ్వు అసలే పిచ్చివాడివి. పుస్తకాలు కూడా చూస్తూ కూచున్నావంటే మరీ పిచ్చెక్కిపోతుంది' అనేవాడు పైగా.

* తెలుగుదేశంలో ప్రచారంలో ఉన్న కాళిదాసపత్ని విద్యావతి కథ దీనికి విరుద్ధంగా ఉంది. విద్యావతి భర్తని తిరస్కరించి

మా నాన్నతో ఈమాట చెప్పినా ఆయన ఏమీ అనలేదు."

"చిన్న జమీందా రేమవుతాడు మీకు?"

"అరె! తెలియదూ నీకు? నాతమ్ముడు. మా సవితల్లి సంగతి చెప్పలా ఇప్పడు నీకు? ఆవిడ కొడుకు. మా అమ్మ పోయింది."

"అహాఁ. తెలిసింది. సరే మరి మీ నాన్న గారితో ఎప్పుడూ చెప్పలేదూ?"

"ఊహూఁ. చెప్పానంటే ఇంకేమన్నా ఉందా? చిన్న జమీందారొచ్చి నా వీపు తాట ఒలుస్తాడు. ఒకొక్కరోజున కొట్టాడంటే —"

"కొడతాడా? మీరు అతడికన్న పెద్దవాళ్లు కదూ!"

"పెద్దవాణ్ణయితే ఏం లాభం? జమీందా

#  స్వయంసిద్ధ 

కరేంటి నాకే! నీకు ఆ సంగతి తెలియదనుకుంటాను."

"అదేమిటి? మరి మీరు?"

"నేనో మొద్దునీ, జడభరతుణ్ణీ పిచ్చివాణ్ణీ అని అంటారందరూ. అందుకనే నాతో ఎవరూ అసలు మనసిచ్చి మాట్లాడరు. అంచేత నేగా నీతో మాట్లాడుతూంటే నాకు చాలా బావుందన్నాను. నిజంగా! నీ మాటలు ఎంత తియ్యగా ఉన్నాయనుకున్నావ్! నీకు నేనంటే యిష్టమేనా?"

తన హృదయంలో రేగుతున్న తుపానుని ఉగ్గబట్టుకుని "ఎందు కిష్టం ఉండదు? చాలా యిష్టం" అన్నది చండి గ్రుడ్లనీరు క్రుక్కుకుంటూ గద్గద కంఠంతో...

నిస్సహాయుడైన పసిపిల్లవాడిలాగా బ్రతిమాలుతూ "వాళ్ళలాగా కొట్టవుకద! మా పిన తల్లిలాగా కళ్ళెర్రచేయవుకద! నాతో ఎప్పుడూ ఇలా మాట్లాడతావా?" అని అడిగాడు.

చండి దుఃఖాన్ని దిగమింగి, "ఎందుకు మాట్లాడను? తప్పకుండా మాట్లాడతా. మీకు సంతోషాన్ని కలిగించే ఏపని చెయ్యమన్నా చేస్తా" అన్నది.

వరుడు పట్టలేనంత ఉత్సాహంతో "నిజంగా! వహ్వా! అట్లా చేశావంటే భలే. ఇంకా ఏంకావాలి? నువ్వు ఇలా మాట్లాడుతూంటేచాలు ఊరికే కూచునివింటూ ఉంటా. నువ్వింకా యేంచెయ్యక్కర్లేదు" అన్నాడు.

చండి నవ్వు తెచ్చిపెట్టుకుని, "నాకు చాలా కథలు వచ్చు. అవన్నీ చెపుతా మీకు. కాని మీరుమాత్రం నామాట ఒకటి నిలబెట్టాలి" అన్నది.

అతడు ఆమెముఖంకేసి ప్రశ్నార్థంగా చూశాడు.

"మీరుకూడా అందరిలాగా చదువుకుని ప్రయోజకులవాలి" అతడి నోటమాట లేదు. విస్తుపోతూ భార్యకేసే చూస్తూ ఊరుకున్నాడు. "ఇప్పుడదంతా ఎలా సాధ్యం?" అని ప్రశ్నిస్తున్నట్లుంది - ఆచూపు.

చండి రాజకుమారి అయిన విద్యావతి కథను భర్తకి చెప్పిందప్పుడు. అతడా కథని ఎంతో శ్రద్ధగా విన్నాడు. మూర్ఖుడుగా ఉండిన కాళిదాసు కఠోరసాధనవల్ల అంత మహాకవి అయినాడని విని ఉత్సాహం పట్టలేక - "వాహ్! వాహ్! వింటూంటే ఎంతో ఆనందంగాఉంది" అన్నాడు.

చండి భర్తకేసిచూస్తూ "మీరుకూడా అలా అవాలని అనిపించటం లేదూ?" అని అడిగింది.

అతడు సంతోషంతో "నాకా? ఆఁ. ఉంది. ఎవరైనా నాకుకూడా అలా నేర్పి, నా బాధ్యతనువహిస్తే నేనూ అలాగే చదువుకుంటాను" అన్నాడు.

"మీరు తప్పక చదువుకోవాల్సిందే! మీ బాధ్యతని నేను వహిస్తాను. మీకోసం ఆ కఠోరసాధనను నేనే చేస్తాను" అన్నది చండి దృఢనిశ్చయంతో...

## 7

పెళ్ళికొడుకు పెళ్లిపందిట్లోకి రాగానే అతణ్ణిగురించి అవాంఛనీయమైన గుసగుసలెన్నో బయలుదేరిన సంగతీ; అక్కడ పెళ్లికొడుకు ఒక్క మాట కూడా మాట్లాడకపోయేసరికి - ఆడవాళ్ళంతా పుట్టించిన వదంతులూ - అన్నీ యధాతథంగా తలితండ్రుల చెవిని పడ్డాయి. తలవనితలంపుగా తటస్థపడిన ఈ సంబంధానికి వారెంతో సంతోషంతో ఉప్పొంగిపోయారు. కాని వరుణ్ని గురించి అందరూ తలోకరీతిగా వెలిబుచ్చిన అప్రియమైన అభిప్రాయాలు వారి ఆనందాన్ని చెరిపేస్తున్నాయి. కాని ఈ విషయమై హరినారాయణబాబుని ఎవ్వరూ ఏమీ అడగలేకపోయారు. అంతే కాదు - ఆయన ఎదుట నిలబడి ఎవరూ వరుణ్ణిగురించి చప్పరించటానికూడా సాహసించలేకపోయారు.

పెళ్ళి అయిన మర్నాడుదయం బంధువులంతా పూజామందిరంవసారాలో చేరారు. వరుణ్ని గురించిన సమాలోచనలు ప్రారంభమయాయి. శోభనపు గదిలోంచి చిన్నపుచ్చుకుని వెళ్లిపోయిన వనితలు కూడా చాలామంది చేరారక్కడ. ఓ భోగట్టా తెలుసుకోవటం లేదు. ఓ మాటా - మంచీ ముందుగా అనుకోవటంలేదు. పుసుక్కున సరే అంటే సరే అనుకుని తాంబూలాలు పుచ్చేసుకున్నారు. గొప్పవాళ్ళయినందుకు ఏమిటి ఫలితం?" అన్నారు సన్నగా ఒకరు.

కరాలీబాబు కఠినంగా "ఇప్పుడెందుకు వచ్చిన మాటలూ ఇవన్నీ? మీరంతా చూస్తే రభస చేసేట్లున్నారే! భవితవ్యాన్ని మార్చ గలిగినవారెవరయినా ఉన్నారా ఏమున్నానా?" అన్నాడు.

చండి సరిగ్గా ఇదే సమయానికి ప్రాతః కృత్యాలన్నీ నిర్వర్తించుకుని అక్కడికి వచ్చింది. మాట్లాడుతున్న వారందరూ చటుక్కున ఆపారు. అందరి కోపపు చూపులూ చండి ముఖంమీద పడ్డాయి. కాని ఆమె ముఖంలో విన్నదనపుఛాయలేమీ లేవు. ఒక్క విచార రేఖయినా ఆమె ముఖం మీద విరిసి - ఆ ముఖాన్ని రవంతయినా వికృతం చేయలేదు. పైగా ఆమె ముఖం అపరిమితమైన తృప్తితో, అతిప్రసన్నమైన చిరునవ్వుతో విల్లివిరిసిపోతోంది. పెళ్లయిన మర్నాడు ఏ ఆడపిల్ల మొహమూ ఇంత సుప్రసన్నంగా ఉండదు సాధారణంగా.

కూతురి స్వభావం తల్లిదండ్రులకు తెలియందికాదు. వారుభయులూ చండి ముఖంకేసి చూసి ప్రశాంతంగా నిట్టూర్చారు. 'శోభనపు గదిలో అనర్థకమేమీ జరిగి ఉండదు. అందరూ ఇహ లాభంలేదని ఎక్కడివాళ్లక్కడ వెళ్లిపోయినా - 'అల్లుణ్ణి అమ్మాయి తరచి తరచి ఏవో ప్రశ్నలు వేసి - అతణ్ణి చులకనచేసి ఉండదు. చండికి అతడు తప్పక నచ్చిఉంటాడు. లేకపోతే చండి నవ్వుమొహంతో ఇక్కడికి వచ్చేదికాదు' అనుకున్నారు.

అప్పుడిహ అక్కడివారంతా ప్రశ్నల వర్షం కురిపించారు. 'మీ ఆయన ఎలాంటివాడే? నోరువిప్పి మాట్లాట్టం చేతవునా? గదిలోకి వచ్చినా మత్తు వదలనట్లుంది! అయినా నీ మొహంలో ఇంత చిరునవ్వేమిటి?' ఇలా ఒకటే ప్రశ్నలు; అప్రియమైన చర్చలు. వయసులో ఉన్నవారు, వయసు మళ్ళినవారూ ఇదే వరస...

చండి ముఖంమీద నవ్వు అప్పటికీ ఇంకా అలాగే ఉంది. కోపం కాని, చిరాకుకాని, ఆ లక్షణాలేవీ కన్పించలేదు. ఆమె అలా నవ్వుమొహంతోనే ఒక్కమాటతో అందరి ప్రశ్నలకీ జవాబిచ్చింది. "భగవంతునిలో విశ్వాసం ఉంచి ఏదయితే కోరుకుంటారో - అదే ఇస్తాడాయన. నేను ఫిర్యాదు చెయ్యవలసిందేమీలేదు. అలాంటప్పుడు ఇహ సొందుకివన్నీ?"

కుతూహలంకొద్దీ ప్రశ్నలు వేసినవారి ముఖాలన్నీ వెలవెలపోయాయి. ఇరుగు పొరుగు ముసలమ్మలు మాత్రం విస్తుపోయి మూతులూ - ముక్కులూ విరుచుకుంటూ ఒకరి మొహాలొకరు చూసుకోటం మొదలెట్టారు. మనకి పూర్వపరిచితురాలైన మైత్రాగారి భార్యమాత్రం కుతూహలంతో - "వాళ్లన్నట్లు అల్లు డేమిటో అడివిలోంచి వచ్చినట్లున్నాడే మే! ఎవరితోనూ



ఒక్క మాటన్నా మాట్లాడలేదుట! కిమ్మంటే ఒట్టుట!" అంది.

ఆ మాట చండి మనస్సుకి కష్టం కలిగించినా - ఆ కష్టాన్ని పైకి వెలిబుచ్చకుండా - "వాళ్ళంతా ఆయన కూడా తమలాంటి జంతువే అనుకుని అదే ధోరణిలో గొడవ చెయ్యటం మొదలెట్టారు. నిజానికి ఆయన మనిషి కనుకనే మొదలకుండా ఊరుకున్నారు" అన్నది కటువుగా.

"భలేదానివే నువ్వు" అన్నదొక యువతి.

చండి నవ్వుతూ "నేనూ మొదలకుండా నే ఊరుకున్నాను. నేనేం తైతక్కలాడనూ లేదు-, సిగ్గూ-శరం లేకుండా వాగనూ లేదు..." అంది.

మరొక యువతి మూతి విరుచుకుంటూ "శోభనపు గదిలోకి వచ్చి ఎవరూ జపం చేసుకుంటూ కూచోరు" అంది.

"అది నిజమే - కాని మీలాగా ఎవరూ అంత రణగొణ ధ్వనీ చెయ్యరు.!

మైత్రా గారి భార్య చండిమాటలకి వత్తాసిస్తూ "అది అబద్ధం కాదే! మీరంతా ఆ రోజు కాగోజాకి మరీ పట్టపగ్గా లేకుండా పగలబడిపోతున్నారులెద్దూ! అదేం మహా గొప్ప అనుకుంటున్నారేమో! ఈ విషయంలో మాత్రం మీరంతా చండిదగ్గిర పాఠాలు నేర్చుకుంటే బావుంటుంది... అవును కానీ, చండీ! ఇంతకీ అల్లుడేమయినా మాట్లాడాడే నీతో?" అని అడిగింది.

చండి ఏమాత్రం సంకోచించకుండా "ఏం? ఎందుకు మాట్లాడరు?" అంది.

ఒక వయసు మళ్ళినావిడ విస్తుపోతూ - "వా! వా! విన్నారా దాని మాటలు! మా కాలంలో ఎన్నడైనా ఎరుగుదుమా ఇంత ఇది?" అంటూ బుగ్గలు నొక్కుకుంది.

"భలే, మీరు పెళ్ళయితే చేయొచ్చు కాని, మేం మాట్లాడుకుంటే నేనా తప్పు? బాగుంది..." అన్నది చండి.

మైత్రా గారి భార్య ముఖం చాటుచేసుకుని నవ్వి, "ఏంమాటలు మాట్లాడుకున్నారే! చెప్పు విందాం" అని అడిగింది.

ఆవిడ అలా అనటం చండికి కష్టం కలిగించింది. అయినా ఆకష్టాన్ని పైకి వలిగక్కకుండా, సహజమైన ధోరణిలోనే "ఈమాట నన్నడగకుండా, ఎవరిఅబ్బాయో వారినే అడిగితే బావుంటుంది. దీని కింత చర్చ యెందుకు?" అన్నది.

మళ్ళీ అందరి ముఖాల్లోనూ ఆశ్చర్యం వ్యక్తమయింది. చుట్టూఉన్న అమ్మలక్కల మొహాల్లో అప్పటిదాకా ఉన్న ఆనందం మాయమైపోయింది. అందరి మొహాలూ చిన్నబోయినాయి. మరీ దగ్గిర ముట్టాల మనస్సుల్లో అప్పటివరకూ అలుముకున్న దిసుళ్ళన్నీ మాయమైనాయి.

#  స్వయంసిద్ధ 

"ఇందుకనే నేనేమీ మాట్లాడలేదు. ఎవర్నీ ఏమీ అడగలేదు. చండినోటి మీదుగా చెప్పనిదే నేనీసంగతి ఎక్కడా అనతలచుకోలేదు. ఇదంతా వొట్టి కల్పన - నిరాధారమైనసంగతని నేను చండిమొహం చూడగానే గ్రహించాను" అన్నాడు కరాలీ చటర్జీ.

చండి తనలో తాను నవ్వుకుంది. ఆడపిలలు చిన్నప్పుడే తల్లితండ్రులను విడిచి "పెటే మరొకరింట్లోకిపోయి పడక తప్పదు. తెలివి తేటలుకల ఆడపిల్లలయితే జాగ్రత్తగా ఆలోచించి, ఆచి తూచి మాట్లాడగలుగుతారు. అలాంటివాళ్లు మెట్టిన ఇంటి గౌరవాన్ని పుట్టినయింటి మర్యాదనూ కూడా కాపాడగలుగుతారు. చిన్నప్పట్నుంచీ తాతగారిదగ్గర ఈ ఉభయకుటుంబాల మర్యాదనూ ఎలా కాపాడాలో చండి చక్కగా నేర్చుకుంది. దాంతోపాటు అనవసరమైన లజ్జా సంకోచాలను విసర్జించటం కూడా అలవాటు చేసుకుంది.

చుట్టుప్రక్కలఉన్న చుట్టాల చిన్నబోయిన ముఖాలు కొంచెంసేపటికి తెప్పరిల్లుకున్నాయి. అప్పుడిహ క్రితం రాత్రి శోభనపు గదిలోకి వచ్చిన ముత్తైదువులకందరికీ - ఒకొక్కరికి ఒకొక్క మొహరీ చొప్పున మామగారివద్దనుంచి పుచ్చుకుని ఇచ్చింది చండి. ఆ శోభనపురాత్రి వారంతా మామూలుగా పొందే ఆనందమయితే పొందలేదు; కాని ఇలాంటిదానికి ముత్తైదువుల కొకొక్కరికి మొహరీ దక్షిణగా ఇవ్వటం మాత్రం వారెక్కడా వినను కూడా లేదు. అప్పుడిహ వాళ్ళ సంతోషం వర్ణనాతీతం!

పుట్టింటిదగ్గర సెలవు తీసుకుని ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళబోయేముందు తల్లికి 'కనకాంజలి' నివ్వటం ఆచారం. చండి ఈ ఆచారాన్ని ధిక్కరించి అందర్నీ విస్తుపోయేట్లు చేసింది. ఒక ఇత్తడిపళ్లెంలో బియ్యంపోసి, తాంబూలం, ఒక రూపాయి ఉంచి ఇది మీ అమ్మ ఒడిలో ఉంచి 'అమ్మా! నీ రుణం తీర్చుకుని వెళ్ళిపోతున్నాను' అని అనమని చెప్పారు.

ఈ సమయంలో సహజంగా - ఎడబాటు కలగబోతోంది కదా - అనే కారణాన ఏడుపు పొర్లుకొచ్చి, కన్నీళ్లు కాల్వలు కడతాయి. చండికి కూడా కళ్ళవెంట నీళ్లయితే వచ్చాయి కాని, పల్లెటూళ్ళలోని ఆడపిల్లలాగా ఆ ఏడుపుతో ప్రక్కనున్నవాళ్లని కూడా కంగారు పెట్టించటానికి మాత్రం పీల్లేదు. 'మాతృరుణం తీర్చుకున్నాను' అని చెప్పటంఅనేది ఆమె చెవులకేదో ములుకు పోకినట్లు బాధించసాగింది. 'నే నామాట మాత్రం చెప్పను' అన్నది చండి.

"అదేమన్నమాటే చండీ? ఇది నియమంగా వస్తున్న ఆచారం. అలా అంటూ అవన్నీ ఆ పళ్లెంతోసహా తల్లికి చెయ్యాలి" అని ఒక్కరు కాదు - అందరూ అన్నారు

చండి గద్గద కంఠంతో "మాతృరుణం ఎన్నటికయినా తీర్చుకోగలరా ఎవరైతే మాత్రం? అంత అబద్ధం చెప్పనా?" అన్నది.

అప్పటివరకూ విచారంతో నిలబడి ఉన్న చండితల్లి ఈ మాటలు విని ఆనందంతో ఉప్పొంగిపోయింది. అయినా ఆమె తన ఆనందాన్ని వెలువరచకుండా - చెప్పవలసిన విధానం ఏదో ఆమే ఆదేశించింది. "వద్దులేవే అమ్మాయ్! అవన్నీ అనక్కర్లేదులే...ఆచారం ఉందిగా మరి! పెంచిన ఋణం తీర్చుకుని వెళ్తున్నా' నని చెప్పు"

"ఈ పళ్ళెములో బియ్యం, ఆకులూ, వక్కలూ, ఓ రూపాయి—వీటితో నేను పెంచిన ఋణమయితే మాత్రం తీరుతుందా అమ్మా! ఇది నీకివ్వమని వారే యిచ్చారు నాకు. ఇది నీకిచ్చి, నేను నీ ఋణం ఏ విధంగానూ తీర్చుకోలేను అమ్మా!" అన్నది చండి.

"ఇలా ఆచారాన్ని ఎదిరించి మాట్లాడటం ఎక్కడా వినలేదు మేము" అని అక్కడున్న ఆడవాళ్ళు పిన్నా - పెద్దా అందరూ అన్నారు.

పూజామందిరంవసారా ముంగిలిలోకి ఉభయవర్గాల ముఖ్య బంధువులందరూ ఈ లాంఛనం జరిపించటానికి వచ్చి ఉన్నారు. చండి తన ఈ అభ్యంతరాన్ని సంకోచిస్తూ మెల్లిగా వెలిబుచ్చలేదు. అందుచేత ప్రాంగణంలో ఇతర సంగతులేవో మాట్లాడుకుంటూఉన్న ముఖ్యబంధువు లందరూ చండి మాటల్ని స్పష్టంగా విన్నారు.

ఆ మాటల్లోని ములుకు తగలవలసిన చోటుకే పోయి తగిలింది. హరినారాయణబాబు సంతోషంతో "నిజమైన మాట చెప్పావు తల్లీ! అదే కావాల్సింది. ఏదో పొరపాటు జరిగినప్పుడు - దాన్ని కళ్లు మూసుకుని అంగీకరించటం కాదు కావల్సింది - ఆ పొరపాటును ఎత్తిచూపి ఖండించాల్సిందే. నిజమే. ఈ స్వల్పమైనదాంతో పెంచిన ఋణం ఎన్నడైనా తీరుతుందా? పైగా యిది వాళ్ల కుమ్మంలోని రాతితో వాళ్ళతలే పగలకొట్టటం లాంటిది. ఆగు అమ్మా! ఒక్కక్షణం ఆగు. దీనికి చేయతగిన విధానమేదో నేను చూస్తాను. నిజంగా నే చేసిన ఓ గొప్ప పొరపాటును పట్టేశావు అమ్మాయీ! చాలా సంతోషం" అన్నాడు.

ఇంటిల్లిపాదీ ఆశ్చర్యపోయేట్లు - హరినారాయణబాబు తన తాలూకు వారిని కొందరిని పిలిచి కోడలివ్వవలసిన కనకాంజలికి తగిన యేర్పాట్లు ఆదేశించాడు. కరాలీబాబు సవినయంగా ఎంతో అడ్డుపడబోయాడు. కాని ఆయన ససేమిరా వినలేదు. హరినారాయణబాబు నవ్వుతూ, "కోడలిముఖతః వచ్చినమాట నా చెవిని పడింది బావగారూ? దాన్ని కాదనటానికి మన కెవరికీ తాహతులేదు. ఈ విషయంలో ఇహ మీరు ఎన్ని అడ్డంకులు చెప్పినా లాభంలేదు. మీ రింత సంకోచపడటానికి ఏముంది గనుక? మీ అంతట మీరు మీ అల్లుడికి పళ్లెంనిండా రూపాయలుపోసి, ఇంకా ఎన్నో వస్తువులతోపాటు కట్నంగా ఇచ్చారు. వాటిల్లో ఒక్కటయినా నేను వద్దన్నానా? అలాంటప్పుడు మా కోడలు తన తల్లికి యథార్థమైన 'కనకాంజలి' ఇవ్వ తలచుకున్నప్పుడు మీ రెందుకు స్వీకరించకూడదో చెప్పండి" అన్నాడు.

హరినారాయణబాబు ఇంత యుక్తియుక్తంగా మాట్లాడిన మీదటదాన్ని కాదనటానికి ఎవరూ సాహసించలేకపోయారు.

కనుక చండి మామగారిచ్చిన అయిదు వందల నవర్సులూ పళ్లెంనిండాపోసి, తల్లినుద్దేశించి యథార్థమైన కనకాంజలి ఇస్తూ - "పెంచిన రుణంమాత్రం ఎలాగో తీర్చుకుని సెలవు తీసుకుంటున్నానమ్మా!" అన్నది.

ఇలా అంటూంటే చండిగొంతు బొంగురుపోయింది. కట్టతెగిన ప్రవాహంలా కన్నీళ్లు స్రవించసాగాయి. ఆ సమయంలో అందరికీ కన్నీళ్లొచ్చాయి. ఆడపిల్ల అత్తవారింటికెళ్ళే దృశ్యం ఈదేశంలో ఎక్కడైనా హృదయానికి బాధ కలిగించేదిగానే ఉంటుంది 




# మా తెలుగు పాపాయి

వై. అనంతరామయ్య

మా తెలుగు పాపాయి
మానికమ్ముల బొమ్మ;
మా పాప మనసెన్న
మంచిగోవుల వెన్న.

మా పాప కండ్లలో
మసలుతూ ఉంటాయి,
కవికుమారుల కంద
గా రాని భావాలు.

మా పాప బుగ్గలలో
మలగి పడుతుంటాయి;
పూల దొప్పలలోన
పొరలు తేనెల సుడులు

మా పాప నవ్వులో
మరి తూగుతుంటాయి;
మల్లికా మాలికా
మధురసిత దీధితులు.

మా పాప మాటలలో
మఱుగు పడుతుంటాయి;
'కృష్ణమ్మ మురళి సం -
గీత మాధురి ఝురులు.

మా పాప నడలలో
మార్మ్రోగుతుంటాయి;
అల మాధవుని గజ్జె -
యల మోహనధ్వనులు.

మంచి గోవుల వెన్న
మా పాప మనసెన్న;
మానికమ్ముల బొమ్మ
మా తెలుగు పాపాయి.



నాటిక:

# గెలిచిన విశ్వం

[సమయం - మధ్యాహ్నం రెండుగంటలు; సుందరయ్యగారిల్లు- వాకిట్లో బల్లముందర కూర్చుని, పజిల్సుకాగితాలు చేతపట్టుకు చూస్తూంటాడు సుందరయ్య. బల్లమీద ఇంకా మరికొన్ని పజిల్సుకాగితాలు వుంటాయి. ఆలోచనలతో బుర్ర, పగలగొట్టుకుంటున్న ఆయన నీరసంగా కనిపిస్తాడు. లోపలినుండి భార్య శాంతమ్మ, ఆయన దగ్గరికి వస్తుంది.]

శాంతమ్మ: ఏమండీ!

సుందరయ్య: (పలకడు)

శాం: మిమ్మల్నే!

సుం: (వినిపించుకోడు)

శాం: (కాస్త బిగ్గరగా) వినిపించదా నామాటలు?

సుం: (కాగితాలను బల్లమీద విసిరికొట్టూ) అబ్బబ్బ! యేమిటే నీపోరు మధ్య!

శాం: నేను నోరుతెరిస్తే చాలు, పోరని అలా కసురుకుంటా రెందుకండీ?

సుం: కసురుకుంటానా; కంసుడిలాగా దుమికేస్తానా?! - నీకు వేయినూటపదహారుసార్లు చెప్పాను - పనిలోవుండగా నన్నేమీ పలకరించవద్దని.

శాం: పని! పని!! పని!!! - ఈ కాగితాలతో యేడుస్తూ కూర్చోవడమేగా మీపని!

సుం: ఓసి పిచ్చిదానా!...ఇవి కాగితాలుకావే; అదృష్టదేవతని వరించడానికి వేసే అప్లికేషన్లు!

శాం: అలాంటి ఆశలుంచుకునే, ఇన్నిరోజులనుంచీ డబ్బు తగలేస్తున్నారు.

సుం: అలా తగలెయ్యడమెందుకో నీకు తెలుసా?

శాం: మీకు పిచ్చెత్తిగాబోలు!

సుం: నువ్వూరుకో. నీకు వ్యాపార రహస్యాలు తెలియవు. శుద్ధ పల్లెటూరిదానివి!

సి. డి. యస్. రామయ్య

శాం: అలా అనే ఇన్నిరోజులనుంచీ నన్ను మోసగిస్తున్నారుగా!

సుం: మోసగించడం కాదే, ఆ రహస్యాలను నువ్వు నమ్మవని. ఈ పజిల్సు వున్నాయే, ఇవి మన అదృష్టానికి దారిచూపిస్తాయి. ఎన్ని శ్రమలకోర్చియైనా, మన మాదారిని పట్టుకునడిచి, విడవకుండా ప్రయత్నిస్తే, మనం తప్పక అదృష్టరాజ్యం చేరుకోగలం.

శాం: మీమాటలు నాకేంఅర్థం కావటంలేదు.

సుం: అంటే, పజిల్సుకోసం మనం యెంత డబ్బు పెడ్తామో, అంతకి పదింతలడబ్బు - యెప్పుడో ఒకప్పుడు, ఒక్కసారిగా ప్రైజు రూపకంగా వచ్చేస్తుంది. కాబట్టి, పజిల్సుకోసం మనం యెంత డబ్బు ఖర్చుపెట్టినా ఫరవాలేదు!

శాం: ఏం ఫరవాలేదుగానీ, ఇంట్లో సుష్టుగా తినడానికి లేకపోయినా, వారంవారం మీరు వీటికోసం డబ్బు చల్లటంమాత్రం తప్పదంటారు. మీ కివరు చెప్పగలరు?

సుం: చూస్తూండు; ఈవారం ఫస్టుప్రైజు తప్పకుండా నాదే!

శాం: అంత నిశ్చయంగా యెలా చెప్పగలరండీ?

సుం: ఫస్టుప్రైజు కొట్టాలనే వుద్దేశంతోనేగదూ, ఈ వారం రోజులు ఆఫీసుకు సెలవుపెట్టి, ఆలోచిస్తూ బుర్ర బద్దలు చేసుకొంటున్నాను. మరేమనుకొన్నావ్?

శాం: (నవ్వుతూ) ఆలోచనలకిబరువెక్కి తల పగిలిపోతుందేమో. జాగ్రత్తసుమండీ! - అదినరేగానీ, మీరింట్లోనే వుంటారుగదూ!

సుం: ఆఁ! - ఏంసంగతి?

శాం: మరేంలేదు; తర్వాత వీధిలో వుంటున్న మా అన్నయ్యింటికివెళ్ళి, శీఘ్రంగా తిరిగొస్తాను.

సుం: వెళ్ళిరా!

శాం: ఎండగా వుందండీ, బాసిలో వెళ్తుతా; ఓ పావలా యివ్వండి వుంటే!

సుం: ఏమిటీ! తర్వాత వీధికి వెళ్ళడానికి బండి కావల్సొచ్చిందేం! మంచి రాదరికమే!

శాం: ఈ యెండలో పోవడం మెలాగయితే? కాళ్లకు చెప్పలు గూడా లేవు.

సుం: ఏమన్నా, నామీదే తప్పు వేస్తావు. అదేమీ బాగుండదు తెలుసా?

శాం: బండికి డబ్బడిగితే, ఈ రామాయణ మేమిటి?

సుం: అబ్బ! నీతో మాట్లాడి మాట్లాడి తలనొప్పి పుడుతోంది... ఇదిగో తీసుకో పావలా! (పావలా యిస్తాడు) పజిల్ కోసం అయిదు రూపాయలుంచుకొంటే అందులో పావలా కరిగిపోయింది.

శాం: ఆ పజిల్స్కైతే ఎంతైనా ఖర్చవడానికి మనసొప్పుతుందిగానీ, నే నడిగితే కళ్లలో నీళ్లు నిలుస్తాయి మీకు. (మూతి తిప్పుతుంది).

[ఇంతలో పుస్తకాలు చేతపట్టుకొని, వీధినుండి వస్తాడు - సుందరయ్యగారి ఏకైకపుత్రుడైనవిశ్వం. వాడికి పన్నెండేళ్లు వుంటాయి.]

సుం: ఏరా విశ్వం, స్కూలుకి వెళ్ళలేదూ?

శాం: ఎందుకు నాయనా, తిరిగొచ్చేవు?

విశ్వం: ఊరికే వస్తానా మరి! సగందూరం వెళ్ళేసరికి, ఈరోజు 'జాగ్రఫీ' క్లాసుందని జ్ఞాపకమొచ్చింది. క్లాసుకి పుస్తకం తీసుకురాకపోతే, మాష్టారు చీవాట్లు పెడతాడు నాన్నా!

సుం: అవునవును. పుస్తకం తీసుకొని త్వరగా వెళ్లు. టైమయింది.

విశ్వం: అసలాపుస్తకంకొనందే, యెలా తీసుకుపోయేది నాన్నా!

సుం: ఓహో! ఆ పుస్తకం కొననేలేదా? పోనీలే, వచ్చేవారం కొంటానని మేష్టారుతో చెప్పు!

విశ్వం: ఊహుఁ! అసలే ఆ మేష్టారు కోపిష్టి. పుస్తకం లేదంటే, క్లాసునుండి బయటికి పొమ్మం





విహంగ విహారము

చిత్రకారిణి: శాంబి రాజకుమారి.

# ★ గెలిచిన విశ్వం ★

టాడు. నాకు దబ్బియ్యి. పుస్తకం కొనుక్కుంటాను.

సుం: డబ్బా?! - ఇప్పుడు నా దేతిలో కానీ లేదు. నేనెక్కణ్ణుంచి యిచ్చేది?

విశ్వం: ఆ పుస్తకం వెల ముప్పావలామాత్రమే! నీ జేబులో వుంటుంది చూడు నాన్నా!

సుం: నాదగ్గర లేదంటేవినవ్రా?

విశ్వం: (ఏడుపు కంఠంతో) అయితే ఆ పుస్తకం లేకుండా నేను క్లాసుకి వెళ్లను.

శాంత: అదేమండీ; పిల్లాడు పుస్తకానికి డబ్బడిగితే, వుంచుకునే లేదంటారేమిటి? ముప్పావలా కాస్తా యిచ్చి పంపండి.

సుం: ఊరుకోవే! ఇప్పుడుండు కొన్న డబ్బులో అంతా ఇలాగే హారించిపోతే, ఆతర్వాత పజిల్సుకు కట్టడానికి నేనేంచేసేది?

శాం: కట్టడం మానెయ్యండి! ఇంతవరకూ ఇన్నిరూపాయలు ఖర్చు రించారేగాని, ఒక్కసారేనా, ఒక్క కానీవచ్చిన పాపాన పోలేదు. ఇంతకీ అదృష్టంవుండేపక్షంలో యెప్పుడో ప్రైజు వచ్చివుండేదిగా!

సుం: అబ్బ! - మీరంతా ఒక్తి ఏద్దమ్మలు. మీతో మాట్లాడి నేను జయించలేను - ఒరేవిశ్వం! ఇదిగో, ముప్పావలా తీసుకుపో! నాముందర నిలవకు. (ముప్పావలా విశ్వానికి యిస్తాడు.)

[తల్లీ కొడుకులు వీధిగుమ్మం దాటుతోంటే, చేతులతో తల పట్టుకు చూస్తూంటాడు సుందరయ్య.]

* * *

[కొన్ని రోజుల తర్వాత - ఒకరోజు సాయంత్రం ఆరుగంటల సమయం. సుందరయ్య బల్లదగ్గర కూర్చుని, ఏవో కాగితాలను చూస్తూవుంటాడు. విశ్వం వీధిలో నుండి వస్తాడు.]

సుంద: ఒరే విశ్వం! ఇంత సేపూ ఎక్కడ తిరిగివస్తున్నావురా వెధవా?

విశ్వం: తిరిగి రావడం లేదు నాన్నా; ఆడుకొని వస్తున్నాను.

సుం: ఏడిశావ్ గాని, ఇక నా పుస్తకాలు ముందేసుకుని దీపం దగ్గర కూర్చో!

విశ్వం: అట్లాగే — కాని, నాన్నా! - నువ్వు వేస్తున్నావే, ఆ పజిల్సులో డబ్బు వస్తుందనేనమ్మకం నీకు వుందీ?

సుం: అదేమిట్రా; మీ అమ్మకి కలిగిన సందేహం నీకూ కలిగిందీ - పజిల్సులో డబ్బు రాదని ఎవరు చెప్పేరు నీకు?

విశ్వం: అబ్బే, ఎవరూ చెప్ప లేదుగాని, నాకే నమ్మకం లేకుండా వుంది.

సుం: మనం వేసే 'ఆన్సరు' - 'ఆల్ కరెక్ట్' అయితే, తప్పక ఫస్టు ప్రైజు యిచ్చితీరవలసిందే! అలా కంపెనీవా డివ్వకపోయాడా, మనం మంచి సాక్ష్యాలు చేతబట్టుకుని కంపెనీవాడిమీద కోర్టులో కేసు బనాయించవచ్చు.

విశ్వం: అయితే, నీకెప్పుడూ ఫస్టుప్రైజు రాలేదేం నాన్నా?

సుం: వస్తుందిరా, నాయనా వస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు సూటిగా - లంప్‌గా - కొట్టేయకుండా మానుతానా - అదృష్టం వుండాలిగాని.



హిజ్ మాస్టర్స్ టైపిస్ట్

ఫొటో: వేముల ఆచార్య; విజయవాడ.



సేఫ్టీపిన్నుతో కొంగ

(పిన్నును రెండవ పటములో విధముగా వంచి దాని కూర్చవలెను.)

చిత్రకారుడు: పి ఆనంద్; (13 సం॥) కడప.

విశ్వం: ఒకవేళ అదృష్టంవుంటే, గుడ్డిగా ఆన్సరు రాసేస్తేకూడా ప్రైజు వస్తుందంటావా నాన్నా.

సుం: ఓం! అల్లాగూడా ఒకవేళ రావచ్చు.

విశ్వం: అయితే, ఒకవేళ నాకూ ఫస్టు ప్రైజు రావచ్చన్నమాట!

సుం: ఏమిటీ; నువ్వూ పజిల్సు రాసివేశావేంరా!

విశ్వం: అవున్నాన్నా! - ఓ వారంముందు నువ్వు నాలుగురూపాయలుకట్టావే! ఆ పోటీలో నేనూ కలుసుకున్నాను.

సుం: నీకు డబ్బెక్కడిదోయ్?

విశ్వం: ఓపావలా నీవద్దా, ఓ పావలా అమ్మవద్దా సంపాదించి కట్టేను.

సుం: నీకెప్పుడూ నేను కానీ యివ్వనైనా లేదే?

విశ్వం: కొన్నిరోజులకిందట,

# ★ గెలిచిన విశ్వం ★

'జాగ్రఫీ' పుస్తకంకొనాలని ముప్పావలా నీవద్ద తీసుకుపోయానా!? – అసలు కొత్తపుస్తకం వెల ముప్పావలాయే. కానీ, స్కూల్లో 'సమయానికి అదే పుస్తకం 'సెకండ్ హాండ్'దొరికింది. అర్ధరూపాయితో ఆ పుస్తకాన్ని కొన్నాను. మిగతా పావలా వుంచుకొంటే పజిల్సు కట్టాలనేకోరిక కలిగింది. ఆ పావలాతో పాటు మరోపావలా అమ్మదగ్గర అడిగి తీసుకుని కట్టాను.

సుం: ఎంత నాటకం ఆడావురా వెధవా! – పోనీ, అర్ధరూపాయి కట్టావే, యేదేనా ప్రైజు వచ్చేట్టుందా?

విశ్వం: అదే ఇప్పుడు నేచేసిన పొరబాటు నేవేసిన ఆన్సరును నేను 'నోట్' చేసుకోవటం మర్చిపోయాను.

సుం: (కోపంవచ్చి) ఛీ వెధవా! (విశ్వం చెంపమీద చేత్తో ఛడీమని కొట్టి) ఇలా పుస్తకాలకని సాకులు చెప్పి, డబ్బులాగటం యెన్నిరోజుల నుండి నేర్చుకొన్నావ్? – ఆ అర్ధరూపాయిని, అలా అనర్థకంగా నాశనం చేయకపోతే, నావద్ద యిచ్చివుంటే, నేను జాగ్రత్తగా – ఆలోచించి ఉపయోగించేవాణ్ని! – పో! అవతలకి – నాముందు నిలవొద్దు!

[శాంతమ్మ లోపలినుండి వస్తుంది.]

శాంత: అదేమండీ, పిల్లవాడి

మీద చెయి చేసుకుంటున్నారు? ఊరుకోండి.

సుం: పిల్లాడు! మహా రత్నాన్ని కన్నావుగాని ఆ వెధవకి మాత్రం ఈ రాత్రి అన్నం పెట్టకు. వాడికి అన్నంపెట్టావా, నిన్నేం చేస్తానో చూడు.

శాం: బాగుంది, మీ నరసింహావతారం......ఏరా, విశ్వం! ఏం చేశావురా?

విశ్వం: ఏంలేదే అమ్మా; ఏదో సరదాపుట్టి పజిల్సుకు ఒక అర్ధరూపాయి వేశానే. అందుకు నాన్న మండిపడుతున్నాడు నామీద.

శాంత: మండిపడరూ మరి? ఏం, మీరు రూపాయలకి రూపాయలు ఆ పజిల్సుకు ధారపోస్తున్నారే, అంతకంటే ఎక్కువ ధారపోశాడా వాడు? కాస్త ఆలోచించండి.

సుం: నాడబ్బు; నేను ఖర్చు చేస్తాను, ధారపోస్తాను. మధ్య నువ్వెవరు అడగటానికి?——

[వీధిన సైకిలువచ్చి ఆగుతుంది. సైకిలునుండి దిగిన పోస్టు జవాను యింటిలోపలి కొస్తాడు.]

పోస్టుజవాను: సార్ సార్!!

సుం: (విసుగుతో) మనుష్యు లెదురుగ్గావుండగా, అలా అరుస్తా వెందుకయ్యా? వస్తున్నా.

పో. జ: టెలిగ్రాం సార్!

సుం: (పాలిపోయి) టెలిగ్రామా? - టెలిగ్రామా?! అయ్యో; మనవూళ్లో ఎవరైనా పోయారా; లేక ఇక్కడికి వస్తున్నారా! - ఏమీ తోచడంలేదే! ఇప్పు డెందుకు నాకు టెలిగ్రాం వస్తుంది?

పో. జ: మీ పేరేమిటండీ?

సుం: నా పేరా; ఏ. సుందరయ్య.

పో. జ: అయితే మీకు కాదండీ ఈ టెలిగ్రాం. మీ పేరిట, విశ్వం అనే అతనికి!

సుం: (ఆశ్చర్యంతో) విశ్వానికా! - ఇదిగో వీడేనయ్యా విశ్వం - మా అబ్బాయి!

శాం: ఎక్కడ్నించి వచ్చిందేం?

పో. జ: 'హనుమాన్ పజిల్స్' ఆఫీసునుంచి వచ్చిందండి. బహుశా యేదేనా ప్రైజు వచ్చివుంటే వుండవచ్చు.

సుం: (టెలిగ్రాం అందుకుని విప్పి చదివి సంతోషము, ఆశ్చర్యంతో) ఏమిటీ! విశ్వానికి పోటీలో ఫస్టుప్రైజు వచ్చిందీ! - యెంత? - పదివేల రూపాయలు! - పదివేల రూపాయలే!! - నేచూస్తున్నది నిజమేనా! - విశ్వం! నాయనా! - ఎక్కడ వాడు?!

విశ్వం: నాన్నా! - నే నప్పుడే చెప్పలేదూ, ఒక వేళ అదృష్టం వుంటే ఫస్టుప్రైజు వస్తుందని!

సుం: (ఆనందంతో వాణ్ని చేతులలో కెత్తుకుని) అవునోయ్! - నువ్వు చెప్పింది అంతా నిజం! - పజిల్సులో ప్రయత్నాలవల్ల లాభం లేదనీ, అదృష్టంమీద ఆధారపడి వుంటుందనీ నాకు తెలిసింది! - నాకు రావలసిన డబ్బంతా నీకు వచ్చేసింది. అదే చాలు!

విశ్వం: ఆ పదివేల రూపాయలు వస్తే, స్కూలు కెళ్ళేందుకు నాకో సైకిలు కొనిస్తారా నాన్నా!

సుం: సైకిలేమిటి; మోటర్ బైక్ కొనిస్తా నాయనా!

శాం: నాకో నెక్లెస్‌కూడా కొనివ్వండి!

సుం: నీకు లేకుండానా!?

పో. జ: అదేమండీ! - మీ విశ్వానికి ఫస్టు ప్రైజు వచ్చిందని తెలియపరచిన నాకు ఏమీ లేదా?

సుం: వుందయ్యా; నీ కిప్పుడే బహుమానం యిస్తాను. (జేబులోనుండి, ఒక రెండురూపాయల నోటు పోస్టుజవానుకిస్తాడు. పోస్టుజవాను వెళ్ళిపోతాడు)

శాం: మన అబ్బాయి, నిజంగా అదృష్టవంతుడండీ!

సుం: అందులో సందేహమా?! (అంటూ విశ్వాన్ని కౌగిలించుకుంటాడు.) ★

సీరియల్:-




## జరిగిన కథ

[మా నాన్నగారు—మహాశ్య ఐసెట్టీ—లాన్గ్యుడాక్‌లో పెద్ద సిల్కు వ్యాపారి. సొంత ఫ్యాక్టరీ అవీ వుండేవి. నేను (చిన్నా) పుట్టినరోజు లగాయతూ మా కుటుంబాన్ని ఏదో ఒక ఆపద చుట్టు ముట్టేస్తూనే వుంది. చివరికి దేశంలో వచ్చిన విప్లవం మూలంగా మా నాన్నగారిస్థితి పూర్తిగా చితికి పోయింది. కొంతకాలానికి మా నాన్నగారు దివాలా తీసి మా ఫ్యాక్టరీని అమ్మేశారు. మేము మా స్వస్థలం విడిచిపెట్టి లయన్స్ పట్టణానికి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ ప్రయాణంలో నా చిలుకను పోగొట్టుకొన్నాను. ఒక పెద్దమనిషి సహాయంతో నేనుమాత్రం లయన్స్ స్కూలులో స్కాలర్‌షిప్ విద్యార్థిగా చేరాను. చేరిన మొదటిరోజే నా బట్టలు చూసి పిల్లలు ఎగతాళి పట్టించారు. మేష్టారికి నేనంటే ఎందుకో గిట్టలేదు. నన్ను ఆయన 'డింభకోపముడు'ని పిలవటం మొదలుపెట్టాడు. నాకా పేరే తగులుకొంది. ఇలావుండగా మా పెద్దన్న 'ఎబ్బీ'కి జబ్బుచేసిందని జాబు రావటమూ, మా అమ్మ, జాక్ అన్నయ్య అక్కడికి వెళ్ళటమూ జరిగింది. వాళ్లు వెళ్ళిన కొన్ని గంటలకే పెద్దన్న పోయాడని టెలిగ్రాం వచ్చింది. అతని అంత్యక్రియలు పూర్తయ్యాక మా అమ్మా, జాక్ తిరిగివచ్చారు. ఆ తరువాత కొంతకాలానికే మా నాన్నగారు వ్యాపారంలో మళ్లా దెబ్బతిన్నారు. మా సంసారం రెండోసారి చితికిపోయింది. ఉన్న నలుగురం విడిపోవలసి వచ్చింది. మా అమ్మని పుట్టింటికి పంపేశాం. జాక్‌ని లయన్స్‌లోనే ఒకకొట్లో గుమాస్తాగా చేర్చారు మా నాన్న. తను సారా వుత్పత్తిదార్ల సంఘంతరఫున ఒక వుద్యోగం సంపాదించుకొన్నారు. నన్ను తనదగ్గరకు పంపితే దాక్షిణాత్య విశ్వవిద్యాలయంలో 'అషర్' వుద్యోగం యిప్పిస్తానని మా నాన్నగారి స్నేహితుడైన 'రెక్టర్' జాబు రాశాడు. ఉద్యోగార్థినై బయలుదేరి సరాసరి ఆయన వున్నవూరికి వెళ్ళాను.

ఆయన చాలా మంచివాడు. మనిషి బక్క పలచగా వుంటాడు. ఎప్పుడూ నవ్వుతూ సరదాగా వుండే స్వభావం. ఆయనలో దర్పమనేది ఏకోశానా లేదు. నేనిలా వచ్చాననే వార్త తెలియగానే చాలా సంతోషించి వెంటనే లోనికి రమ్మని కబురుచేశాడు. నేనాయన గదిలో కాలుపెట్టగానే మాత్రం "అరె! ఖాత్తిగా పసివాడిలా వున్నావే?" అని నన్ను చూసి ఆశ్చర్యపోవటం మొదలుపెట్టాడు.

నిజంకూడా అంతే—ఈ 'డింభకుడు' చూసిన వాళ్లకి నవ్వు పుట్టించేటంత పొట్టి; ముఖంలోకూడా పసితనమే కనిపిస్తుంది కాని అసలుయీడు ఎక్కడా బయటపడదు.

"రెక్టరు" అన్నమాట వినేసరికి నా తల తిరిగిపోయింది. 'అయితే వీళ్లు నాకీ వుద్యోగం యివ్వరు కాబోలు' అని లోలోపల కంగారు పడ్డాను.

నా చిన్నబుర్రలో చెలరేగిన తుఫానుఛాయలను ఆయన పసికట్టాడా అన్నట్లు, అంతలో తను కల్పించుకొని "ఫరవాలేదులే; ఇలారా నాయనా!"...ఐతే నువ్విప్పుడు కాలేజీలో 'అషర్' వుద్యోగంలో చేరటానికి వచ్చావన్నమాట కదూ? మరీ అర్భకుడిలా కనిపిస్తున్నావు. ఈ వుద్యోగంలో నిలదొక్కుకు వుండటం నీబోటివాళ్లకి కష్టమే. అయినా ఏంచేస్తాం?...నీ పొట్ట నువ్వు పోసుకోవలసిన పరిస్థితివచ్చింది. అంచేత వీలైనంత మటుకు ఏదో ఒక సదుపాయం చేద్దాం. మొట్టమొదట నువ్వు కాలేజీలో వుద్యోగానికి పోవటంకంటే, 'సర్లానడీ'లోవున్న పబ్లిక్‌స్కూలుకి వెళ్లి

అక్కడ వుద్యోగంచెయ్యటం మంచిదనుకొంటాను. ముందు అక్కడికి వెళ్ళి ఆ ఉద్యోగంలోని సులువు బలువులన్నీ తెలుసుకో. చిన్నగడ్డమూ అదీ పెంచి, కొంచెం మనిషిలా కనిపించటానికి ప్రయత్నించు. తరువాత సంగతి తరువాత చూసుకుందాం."

నాతో మాట్లాడేస్తూనే, ఆయన 'నర్లానడీ' కాలేజీ ప్రిన్సిపాల్ కి ఒక జాబురాసి నా చేతికిచ్చారు. అక్కడి అధికారులముందు ఎలానడుచుకోవాలో నాలుగైదుసార్లుచెప్పి, ఆరోజే ప్రయాణమై ఆ వూరు పోతున్నారు. వెళ్ళబోయేటప్పుడు ఆదరణ పూర్వకంగా వెన్నుమీద ఒకటి చరిచి, ధైర్యంగా వుండమన్నారు.

'రెక్టర్' యిచ్చిన వుత్తరంతో నాకు రెక్కలు వచ్చినట్లు అయింది; ఆ సంతోషం పట్టలేక, తడవకు నాలుగేసి మెట్లు చొప్పున దూకేసి, వీధిలోకి వచ్చిపడ్డాను. 'నర్లానడీ'కి పోయే అంచెబండిలో నా సీటు రిజర్వుచేసుకోవాలనే తొందరకొద్దీ వీధుల్లోపడి పరిగెత్తాను.

'నర్లానడీ'కి పోయే బండి నాటి మధ్యాహ్నానికి కాని బయలుదేరదని స్టాండుకు పోయాక తెలిసింది. అంటే—యింకా అక్కడ నాలుగుగంటల సేపు పడివుండాలన్న మాట. వేరేపని ఏమీ లేకపోవటం చేత పెద్దబజారులో జోరవిరుచు కాసేపు తిరిగాను. ఆ తరువాత మనకు అందుబాటుగా వుండే ఖరీదులో తిండిపెట్టే హోటల్ ఏదైనా దగ్గరలో వుందేమో నని వెతికాను. అట్టేదూరం పోనక్కరలేకుండానే ఒక హోటల్ కనిపించింది. బోర్డుమీద "విశ్రాంతిభవనం" అని రాసివుంది. హోటల్ పైకి పరిశుభ్రంగా కనిపిస్తోంది.

దాన్ని చూడగానే 'యిది మనకు తగ్గహోటల్' అనిపించింది. అయినా జన్మలో కల్లా హోటల్ కి ఒంటరిగా పోవటం అదే మొదటిసారి కావటంచేత గుమ్మంలో కాసేపు తటపటాయిస్తూ నిలుచుండిపోయాను. చివరికి ధైర్యంచేసి తలుపు తెరిచి లోనికి వెళ్లాను.

లోపల ఎవ్వరూలేరు. గోడలూ అవీ కొత్తగా వెల్లవేసినట్లున్నాయి. ఎడం ఎడంగా కొయ్యటేబుళ్లూ, కుర్చీలూ వున్నాయి. గల్లాపెట్టెదగ్గర లావుపాటి మనిషి ఒకడు కూర్చునే గట్టిగా గురకపెట్టేస్తున్నాడు. ముఖం గుర్తుపట్టటానికి వీలులేకుండా, న్యూస్ పేపరు కప్పుకొని నిద్రపోతున్నాడు.

హోటళ్లకి వెళ్లటం వుగ్గుపాలనాటినుంచీ అభ్యాసంవున్న వ్యక్తిలా, మహాధీమాగా అక్కడవున్న ఒక టేబుల్ మీద పిడికిలితో కొట్టి "ఎవరయ్యా యిక్కడ!" అని అరిచాను.

ఆ లావుపాటి అతను అంతంతమాత్రపు చప్పుళ్లకి నిద్రలేచే మనిషి కాదల్లేవుంది; ఎంతకీ వులుకూ లేదు; పలుకూ లేదు. కాని లోపల ఎక్కణ్ణుంచో అతని భార్య కాబోలు దొడ్డితలుపు తోసుకువచ్చింది. అక్కడా అక్కడా తిరిగే అదృష్టదేవత యీసారి తన మీద కనికరించి ఎవరో ఒక ఖాతాదారుని తన హోటల్ కి పంపించిం దనుకొంది కాబోలు.—నన్ను చూడగానే ఆ యిల్లాలు ఆనందం పట్టలేక ఒక్క కేక పెట్టింది!

"అరె! చిన్నబాబు!!"

ఎవరదీ ?—

"ఆనీ ! మా వంటలక్క ఆనీ!!" నాకు తెలియకుండానే నేనూ అరిచేశాను. కనురెప్పపాటులో ఆమె నన్ను గట్టిగా కౌగలించుకొని కన్నీళ్లు కారుస్తోంది.

కళ్లు నులుముకు మళ్ళీ చూశాను. అవును. నిజంగా ఆనాటి మావంటలక్క 'ఆనీ' యే! ఏమీ సందేహంలేదు. ఒకప్పుడు మా యింట్లో అన్ని పనులూ తనే చేసుకుపోతూ, మా కుటుంబంలోని మనిషిలా మసలిన 'ఆనీ,' యీ రోజు హోటల్ యజమానురాలైంది. వచ్చేపోయే బాటసారులకందరికీ తన అమృత హస్తాలతో ఆహారపానీయాలు అందిస్తోంది.

ఆ క్షణంలో—అంటే యీ చిన్నబాబును అనుకోకుండా కలుసుకొన్న ఆ క్షణంలో—మా వంటలక్క 'ఆనీ' ముఖంమీద వెల్లివిరిసిన ఆనందజ్యోత్స్నలు చూచితీరవలసినవే కాని, వర్ణించ వలవి కానివి.

అప్పుడు చెలరేగిన ఆ ఆనందంలోనూ, ఆ సందడిలోనూ ఎప్పుడో గల్లాపెట్టెదగ్గర కూర్చున్న అతికాయుడు నిద్రలేచాడు. దారేపోయే బాటసారిని తన భార్య యింతగా ఆదరిస్తూ వుండటంచూసి అతడు మొదట్లో కంగారుపడివుంటే వుండవచ్చుగాని, నేను ఫలానా మన్యూ డేనియల్ వి సిల్రేసని ఆవిడ పరిచయం



# అన్నా-చిన్నా

చేశాక మాత్రం, అతడూ యథాశక్తి నన్నుచూసి సిగ్గుపడటమూ, చిరునవ్వులతో స్వాగతాలు పలకటమూ వగైరా విధులన్నీ సక్రమంగా నెరవేర్చాడు. అతనిపేరు 'జాన్ పెయిరల్' అట; 'ఆనీ' చెప్పింది.

"చిన్నబాబు భోంచేశారేమో కనుక్కున్నావా?" పెళ్లాన్ని మందలింపుగా అడిగాడు జాన్ పెయిరల్. భోంచెయ్యకపోబట్టే వాళ్ళని యిలా కలుసుకోవటం తటస్థించింది.

"లేదు. భోంచేసివుంటే అసలు యిక్కడికి రాకుండానే పోయివుందును." అన్నాను.

ఏమిటీ? చిన్నబాబు యింకా భోంచెయ్యనే లేదా? అంతకంటే ఘోరం యింకేమైనా వుందా అన్నట్లు ఆనీ, ఒక్కసారిగా వంటయింట్లోకి పరుగెత్తింది. ఆమెభర్త అంతకంటే హడావుడిగా తన స్థూలకాయాన్ని దొర్లించుకొంటూ పానీయాలు వుండే బల్ల దగ్గరకు పరుగెత్తాడు

భార్యాభర్తా యిద్దరూ కలిసి పట్టుమని పది నిమిషాలైనా గడవకముందే నా కోసం రారాజులకు పెట్టేలాంటి భోజనం ఏర్పాటుచేశారు. కష్టపడి తినటం ఒక్కటే నా వంతుకి వదిలిపెట్టి, మిగిలిన యాతన అంతా వాళ్లేపడ్డారు. నేను భోంచేస్తున్నంతసేపూ యిద్దరూ నాకు చెరోక పక్కనా కూర్చుని వంటకాలూ, పానీయాలు ఒకరితో ఒకరు పోటీలు పడి నా చేతికి, నోటికి అందించారు.

వారి సత్కారాలతో ఉక్కిరిబిక్కిరి అవుతూనే, మధ్యలో ఎలాగో సందు చేసుకొని నే నిలాగ విశ్వవిద్యాలయంలో వుద్యోగిగా చేరబోతున్నాననీ, మర్యాదగా నా పొట్ట నేను పోసుకొనే రోజు ఎట్టకేలకు వచ్చిందనీ వాళ్ళకి చెప్పాను. నా మాటలు విని ఆనందం పట్టలేక మా 'ఆనీ' మూర్ఛపోబోయి మానేసింది.

జాన్ పెయిరల్‌కి యీ వార్తలో అంతపెద్ద విశేషం ఏమీ కనిపించినట్లు లేదు. మాస్టరు డేనియల్ లాంటివాడు, ఆ యీడు వచ్చాక తనపొట్ట తాను పోసుకొనేందుకు ప్రయత్నించడంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదని అతని అభిప్రాయం. ఆ మాటకొస్తే, తను నాయీడు వాడైవుండగా, తల్లీతండ్రి దగ్గరనుంచి పెన్నీ అయినా తీసుకోకుండా అప్పటికప్పుడే నాలుగైదేళ్లు దేశంమీద పడి తిరుగుతూ తన పొట్ట తను పోసుకొన్నాడట. అంతేకాకుండ......

ఏదో చెప్పవచ్చి 'ఎందుకులే చెప్పటం' అన్నట్లు ఆగిపోయాడు. అదీకాక—మాస్టర్ డేనియల్ ఏ సెట్టో, తనూ ఒకటే నన్నట్లు మాట్లాడితే 'ఆనీ'కి కోపం రాదూ?

ఆ విధంగా కబుర్లతోనూ, కమ్మని వంటకాలతోనూ దాదాపు రెండుగంటలకాలం క్షణంలో గడిచిపోయింది! గడచిపోయిన కష్టదినాలను గురించీ రాబోయే మంచిరోజులను గురించీ మాట్లాడుకొన్నాం. మాటల సందర్భంలో మేమంతా పుట్టిపెరిగిన ఫ్యాక్టరీ జ్ఞాపకానికివచ్చింది. లయన్స్ మహానగరంలో బొద్దింకలతో పోట్లాడుతూ గడిపిన రాత్రులు జ్ఞాపకానికి వచ్చాయి అందరూ అభిమానించిన మా పెద్దన్న 'ఎబ్బి' జ్ఞాపకానికి వచ్చాడు......

ఉన్నట్లుండి 'వెళ్లొస్తా'నని చెప్పి కూర్చున్న చోటునుంచి లేచాను.

"అప్పుడేనా?" ఆదుర్దాగా అడిగింది ఆనీ.

అతి ప్రధానమైన ఒకానొక పనిమీద ఆవూళ్లో ఒకరిని వెంటనే కలుసుకోవల్సివుందని చెప్పాను. 'వచ్చి ఒక్కపూటఅయినా కాలేదు: యింకా మాట్లాడుకోవలసినవి బోలెడన్ని వున్నాయి అయినా చిన్నబాబు తన స్వంతపనిమీద అర్జంటుగా వెళ్తానంటే ఆ పటానికి మేమెంతవాళ్లం' అంటూ ఆ భార్యాభర్తా అయిష్టంగా ఒప్పుకొన్నారు.

"భగవంతుడు మిమ్మల్ని కాపాడుతాడు; పోయిరండి చిన్నబాబూ!" అన్నారు యిద్దరూ ఆఖరికి.

ప్రయాణంలోనూ, పొరుగూరిలోనూ నేను తీసుకోవలసిన జాగ్రత్తలు మరీ మరీ చెప్పి, వీధి చివరిదాకా వచ్చి ఆ దంపతులు యిద్దరూ నన్ను దిగబెట్టివెళ్లారు.

నేనా వూళ్ళో చూడాలన్నది ఎవరినో కాదు—మా ఫ్యాక్టరీని: ఏ ఫ్యాక్టరీలో అయితే నేను పుట్టి పెరిగానో, ఏ ఫ్యాక్టరీనైతే నా ప్రాణంకంటే మిన్నగా చూసుకొనేవాణ్ణో, దేన్ని విడిచివచ్చేరోజున అంతగా కుళ్లి కుళ్లిఏడ్చానో—ఆ ఫ్యాక్టరీని; అందులోని పక్క-

పాపులనీ; నా బాల్యస్నేహితులై నా ప్రాణంలో ప్రాణంగా పెరిగిన అక్కడి చెట్లని!

మానవహృదయం ఎంతదుర్బలమైందీ! చెట్టునీ, పుట్టనీ, తలుపు చెక్కనీ, ఫ్యాక్టరీనీ — దేన్ని బట్టితే దాన్ని అతిగాఢంగా ప్రేమించగలదు.

అదీగాక - ఆనాడు సముద్రయానంలో ప్రమాద వశాత్తు నిర్జన ద్వీపంచేరి ఏళ్ళ తరబడి ఒంటరి జీవితం గడిపిన రాబిన్‌సన్ క్రూసో, స్వదేశానికి సురక్షితంగాచేరి, సలక్షణమైన జీవితం గడుపుతూ కూడా, మళ్ళీ ఏనాటికైనా జన సంచారంలేని ఆద్వీపానికి పోవాలని కలలు కన్నాడనీ, అంతవార్ధక్యం లోనూ ఒక్కసారి అక్కడికి వెళ్ళి రాకుండా వుండలేక పోయాడనీ చరిత్రే చెప్తోందికదా!

అలాగే తానొక అపర రాబిన్‌సన్ క్రూసోనని వూహించుకు వుప్పొంగిన యీ 'డింభకుడు' కూడా, చిన్ననాడు తాను అడీ విడచిన నిర్జనద్వీపాన్ని మరొకసారి కన్నులపండువుగా చూసుకోవడం కోసం వువ్విళ్ళూరటంలో ఆశ్చర్యం ఏముంది?

దూరంగా యిళ్లకప్పులమీద నుంచి కనుపించే ఆచెట్లు నురుగులు కమ్ముతూ పరుగెత్తుకొస్తున్న తమ నెచ్చెలిని అప్పుడే గుర్తుపట్టినట్లున్నాయి: వేవేగంగా రమ్మని కొమ్మలు వూపుతున్నాయి. "మన మిత్రుడు 'చిన్నా' వస్తున్నా"డని ఒకదానితో ఒకటి చెప్పుకోవటం కోసం కాబోలు, అటూయిటూ వొంగుతున్నాయి.

వాటిపిలుపునందుకొని వడిగా,



దొమ్మరిగడ

ఫొటో: పి. ఎస్. రామచంద్రరావు; విశాఖపట్నం.

వడివడిగా పరుగెత్తుకొచ్చినవాణ్ణి, తీరా ఫ్యాక్టరీదగ్గరకు వచ్చేసరికి, నెత్తిన పిడుగుపడ్డట్లు నిశ్చేష్టుణ్ణై నిలబడిపోయాను.

ప్రహారీ గోడలు దగ్గరనుంచీ ప్రతిదీ మారిపోయింది. ఇదివరకు ప్రహారీలమీదనుంచి చెట్లకొమ్మలు వేళ్లాడుతుండేవి. ఇప్పుడు ఒక్క ఆకైనా బయటకి కనిపించటం లేదు. అంత ఎత్తు పెరిగాయి, ప్రహారీ గోడలు. ఇదివరకు వర్క్‌షాపు వున్నచోట యిప్పుడు చరి౹ ఒకటి

# దివ్యజ్యోతి

**పి. జి. స్వామి**

ఔరంగజేబు చక్రవర్తి మహారాష్ట్రులపై పగతీర్చుకోవాలని స్వయంగా సైన్యాధిపత్యం తీసుకుని దక్షిణదేశంలో వున్నాడు. మహారాష్ట్రరాజు, రాజారాం చనిపోయిన తరవాత అతనిభార్య తారాబాయి, యుద్ధం సాగిస్తున్నది. వాళ్ళ యుద్ధ పద్ధతి చక్రవర్తికి కొత్తగా వుంది. వాళ్లు అకస్మాత్తుగా గుర్రాలమీద వొచ్చి వొక దెబ్బకొట్టి పారిపోతూ వుండేవారు. చక్రవర్తి అతికష్టంతో వొకకోట పట్టుకొని, కొన్నిసైన్యాలుంచి మరోకోటముట్టడిస్తూవుంటే, పట్టుకున్నకోట మళ్ళీ మహారాష్ట్రులు తీసుకునేవారు. అయినా, ముసలితనంలో మొండిపట్టుదలతో ఔరంగజేబు యుద్ధం సాగిస్తున్నాడు. కాని అతనిలో నిరాశ పుట్టడం ప్రారంభించింది. దానికి రెట్టింపు కోపంకూడా పుట్టింది. అతనిసైన్యాలెక్కడికి వెళ్ళినా అన్నీ ధ్వంసం చేసేవారు. ఆడా, మగా, ముసలీ, శిశువూ, అన్న విచక్షణ లేకుండా చేతికందినవాళ్లని చంపేవారు. వాళ్లు వొస్తారనగానే, ప్రజలు గ్రామాలువిడిచి చుట్టుపక్కల అడవుల్లోకి పారిపోయేవారు.

మొగలుసైన్యాలు వొక కొండ దుర్గం ముట్టడి చేస్తున్నాయి. చక్రవర్తి తన గుడారంలో కూర్చున్నాడు. ఒక సైనికుడొచ్చి అదివరకు పట్టుకున్న దుర్గం తిరిగి మహారాష్ట్రులు వశం చేసుకున్నారని చెప్పేడు. ఆ సంగతి వినగానే చక్రవర్తి, కర్రదెబ్బ తిన్న మహానాగులాగ లేచేడు. కోపంతో బుసకొడుతున్నాడు. సైనికుడు చల్లచల్లగా జారిపోయేడు. ఔరంగజేబు బోనులోని సింహంలాగ అటూ యిటూ పచారు చేస్తున్నాడు. ఈలోగా చీకటిపడుతూవుంటే సేవకులొచ్చి నిశ్శబ్దంగా దీపాలన్నీ వెలిగించేరు. చక్రవర్తికేమీ తెలియలేదు. కొంతసేపైన తరవాత ముఖమలు దిండ్లమీద కూర్చుని, తల వొంచుకొని దీర్ఘాలోచనలో పడ్డాడు. అవమానమూ, క్రోధమూ, నిరాశా, అతణ్ణి దహించేస్తున్నాయి. బుర్రలో ఆలోచనలు వాయువేగంతో పరుగెత్తుతూ వేడెక్కిస్తున్నాయి.

ఆ సమయంలో నాలుగేళ్ల వయస్సుగల వొక చిన్న బాలిక చక్రవర్తి వెనకవైపునుంచి వొచ్చింది. ఆ పిల్ల దుస్తులు చినిగి, మాసి వున్నాయి. పిల్ల బంగారుబొమ్మలా ఉంది. మసిపాతలోని మాణిక్యంలాగ మెరిసిపోతూవుంది. ముఖం చంద్రబింబంలా ఉంది. కళ్లు పెద్దవిగా పెదవులు ఎర్రగా వున్నాయి. చిరునవ్వు ఆపాపముఖానికి వింతకాంతి కలుగజేస్తున్నది. నల్లని తుమ్మెదరెక్కల్లాటిజుట్టు వుంగరాలు తిరిగి ముఖమ్మీద పడుతోంది. ఆపాప లోపలికొచ్చి ఆశ్చర్యంతో అంతటా కలయచూసింది. చివరికి నిశ్చలంగా కూర్చునివున్న చక్రవర్తిని చూసింది. ముఖం సంతోషంతో వికసించింది. అటూ, యిటూ జోగాడుతూ చప్పుడు చెయ్యకుండా అతని వెనక్కి వెళ్ళి, తన చిన్ని చేతులతో అతని కళ్లు మూసి 'అమ్మ దొంగా! ఇక్కడ వున్నావూ? దొరికేస్తవే!' అని పక, పక నవ్వుతోంది.

చక్రవర్తి తన ఊహాప్రపంచంలోనుంచి మేలుకున్నాడు. వేడెక్కివున్న తన ముఖమ్మీదపడిన చల్లని, లేత చేతులు పట్టుకున్నాడు. పాపయొక్క జిలిబిలిమాటలు చెవులలో అమృతధారల్లాగ పడుతున్నాయి. "తాతా! యిక్కడికెలాగొచ్చేవూ?" అని పాప అడిగింది. చక్రవర్తి మాట్లాడకుండా, మృదువైన గులాబీరేకుల్లాటి ఆ చిన్ని చేతులు పట్టుకుని పదే పదే, కళ్ల కద్దుకున్నాడు. అప్పుడు పాపాయి 'తాతా! వోముద్దు!' అని,

---

## అన్నా - చిన్నా

కలిసింది. వీధివాకిలి తలుపుల మీద ఎర్రరాతితో చెక్కిన శిలువ తగిలించి వుంది. దాని అడుగున లాటిన్ భాషలో మంత్రాల్లాంటివి ఏవో రాసివున్నాయి.

ఎంత మారిపోయింది! ఇది వరకటి ఫ్యాక్టరీ యిప్పుడు ఫ్యాక్టరీ కానేకాదు; క్రైస్తవసన్యాసినులుండే మఠం. అందులోకి మగ పురుగుకైనా ప్రవేశంలేదు!

(ఇంకా వుంది)



చక్రవర్తి భుజాలమీదినించి ముందుకి వొరిగి అతని బుగ్గమీద తన లేత పెదిమెలతో ముద్దు పెట్టుకుంది. చక్రవర్తికి అనిర్వాచ్యానందం కలిగి ఆపిల్లని మెల్లగా తన వొడిలోకి తీసుకుని, ఆ లేత బుగ్గలు నిమురుతూ వుండగా అతని ముఖం చూసి పాప తెల్లబోయి కనురెప్ప వాల్చకుండా అతనివేపు చూస్తూ వుంది. 'పాపా! ఎందు కలాగ చూస్తున్నావు?" అని చక్రవర్తి అడిగాడు.

ఆపాప: "నువ్వు మా తాతవి కావు" అని లేచి అతని చేతుల్లోంచి విడిపించుకోవడానికి ప్రయత్నించింది.

చక్రవర్తి: "నేను మరో తాతని. నీ కన్నీ ఇస్తాను. నాదగ్గిరుంటావా"? అని అడిగాడు.

పాప: అతనివేపు కొంతసేపు చూసి "నువ్వు మంచితాతవేనా? నాతో ఆడుకుంటావా? మా తాతలాగ గుర్రమాట ఆడతావా? నాకు ఆకలేస్తే పాలూ బువ్వా పెడతావా?" అని ఏడుస్తూ "మా తాతా, అమ్మా, నాన్నా పోయేరు. పాలూ బువ్వా లేదు. ఆకలేత్తోంది" అన్నది.

చక్రవర్తి బయటకొచ్చి పారాసిపాయిని బంగారుగిన్నెలతో పాలూ, రొట్టే, అన్నమూ, తెమ్మని పంపించేడు. లోపలికొచ్చి చూసేసరికి పాప ముఖమలు పరుపుమీద నిద్రపోతున్నది. పాపముఖముపైగల చిరునవ్వూ, ప్రశాంతతా, చక్రవర్తిని ఆనందపరవశుడిగా చేశాయి. ఆముఖంచూస్తూ మైమరచాడు. వంటవాడు ఆహారపదార్థాలు తెచ్చిపెట్టి సలాం చేశాడు. వానినిపొమ్మని సైగచేసి, వాడు పోయినతరవాత పాపాయిని మెల్లిగా లేపాడు. పాలు గిన్నెలోపోసి యిచ్చేడు. పాలుతాగి అన్నం తినేసరికి పాపకి నిద్రమత్తు వొదిలి "తాతా! అవన్నీ యేంటీ?" అని అడిగింది. చక్రవర్తి వాటిపేర్లు చెప్పి, కొంచెం మిఠాయి ఇచ్చాడు. అది తిని పాప మళ్లీ పరుపుమీద నిద్రపోయింది.

మర్నాడు తెల్లవారకమునుపే చక్రవర్తి లేచి, కాలకృత్యాలు తీర్చుకునేసరికి సూర్యోదయమైంది. నమాజు చేస్తున్నాడు. పాప లేచి కళ్లు నులుపుకుంటూ 'తాతా!' అని పిలిచింది. చక్రవర్తి అప్పుడే ప్రార్థన

# ★ దివ్యజ్యోతి ★

ముగిస్తున్నాడు. పాప మంచంమీది నించి దిగి

"ఏం చేస్తున్నావు, తాతా?" అంది.

చక్రవర్తి: దేవుడికి ప్రార్థన చేస్తున్నాను.

పా: అదా! ఏడీ దేముడు? కనపడడే?

చ: కనపడడు.

పా: అబద్ధం. మా యింటిలో కృష్ణుడూ, రాముడూ వున్నారు.

చ: అవి బొమ్మలు. దేవుళ్లు కారు.

పా: ఊఁ. దేవుళ్లే. నీకు తెలిదు తాతా! కృష్ణు డెంత మంచివాడను కున్నావు. వెన్నముద్ద లిస్తాడు.

చ: మా దేవుడు వేరు.

పా: కాదు.

చ: నీ కెవరు చెప్పారు?

పా: మా తాత. అందరికీ వొకడే దేవుడు.

చక్రవర్తి ఆలోచనలో పడ్డాడు. ఒకడే దేవుడు. పాప మాట నిజం. పాప నెత్తుకుని ముద్దాడి, ఆహారం పెట్టేడు. చక్రవర్తీ, పాపా, మాట్లాడుకుంటున్నారు.

పాపాయి: తాతా! నువ్వెవరూ?

చక్రవర్తి: నేను చక్రవర్తిని.

పా: (అపరిమితంగా నవ్వుతూ) చక్కరవొర్తి! అదేం పేరూ?

చ: అది పేరు కాదు. నా హోదా.

పా: అదేమిటో? నువ్వు తాతవే. నీ కిల్లు లేదూ?

చ: ఉంది ఢిల్లీలో.

పా: ఢిల్లీయా? ఎక్కడుం దది?

చ: చాలాదూరంలో ఉంది.

పా: ఇక్కడ కెందు కొచ్చేవూ?

చ: ఇదంతా జయించడానికి.

పా: అంటే ఏమిటీ?

చ: పట్టుకోడానికి.

పా: (తల అటూ యిటూ ఊపుతూ) నువ్వు పట్టుకెళ్ల లేవు. మా అవ్వ చచ్చిపోయింది. ఏవీ పట్టుకెళ్ళలేదు. అన్నీ నాకిచ్చేసింది.

చక్రవర్తి మళ్ళా ఆలోచనలో పడ్డాడు. "ఇవి యేవీ పట్టుకెళ్ల లేవు" అలాగ నిశ్చలంగా ఉండి పోయేడు. అతని మెడనుండి వేలాడుతున్న బంగారుపతకంతో పాప చాలాసేపాడుకుని, అతనిగడ్డం నిమురుతూ "తాతా! నీపేరు చెప్పవూ?" అని అడిగింది.

చ: నా పేరు అవురంగజేబు.

పా: (భయంతో గడగడ వొణికిపోతూ, అతణ్ణి కౌగిలించుకుని, కళ్లు మూసుకుని) వొద్దు, ఆ పేరు వొద్దు. నువ్వు మంచివాడివి.

చ: ఏమీ? అవురంగజేబంటే యెందు కంత భయం?

పా: వాడు రాక్షసుడు. నిన్ను పట్టుకుంటే నీ రక్తం తాగేస్తాడు.

చ: సరేలే. నీ తాత పేరేమిటి?

పా: తానాజీ తండేకర్.

చ: మీ నాన్న పేరు?

పా: వెంకోజీ.

చ: మీ యిల్లెక్కడుంది?

పా: అక్కడ. ఆ యేటిదగ్గర.

చ: వాళ్లందరూ యేమయేరు?

పా: కర్రల కెళ్లేరు. రాక్షసులొస్తే పారిపోయేరు. నేను రాక్షసుల కంటబడకుండా తాతకోసం వెతికి, వెతికి, వొస్తే నువ్వు దొరికేవు.

చ: మీ తాతని తీసుకొస్తాను. నువ్వెళతావా?

పా: నువ్వు వొత్తావా? మా తాత మంచివాడు. నీ జట్టుంటాడు.

చ: నేను రాకూడదు. మా ఊరు వెళ్ళాలి.

పా: అయితే నే నాడుకుంటుంటాను. అదిస్తావా? (అని చక్రవర్తి మెడలోని పతకం చూపించింది)

చ: తప్పకుండా యిస్తాను.

పాప సంతోషంతో చప్పట్లు చరిచి చక్రవర్తి మెడను పట్టుకుని అతణ్ణి ముద్దుపెట్టుకుంది.

చక్రవర్తి నలువైపులా, తానాజీ తండేకర్, వెంకోజీ తండేకర్లను వెతకడానికి మనుష్యుల్ని పంపించేడు. పాపాయికి ఆ శిబిరంలో యెక్కడికి కెళ్ళినా అడ్డు లేదు. తన యిష్టం వొచ్చినట్టు తిరిగి, చక్రవర్తి చేత్తోనే భోజనం పెడితే తిని అతనిదగ్గిరే నిద్రపోయింది. పాప నిద్రించే వేళలలో, ఆ ప్రశాంతమైన ముఖం చూస్తూవుంటే "అంతా వొకటే. అన్ని రూపములూ దేవుని రూపములే. ఇవి యేవీ నాతో పట్టుకెళ్ల లేను. అవురంగజేబు రాక్షసుడు! రక్తపిపాసి! అమాయకులను నిష్కారణముగా, నిర్దయుడై చంపించిన మహాపాపి! అతని జీవితము వ్యర్థజీవితము!" అని అతని అంతరాత్మ ఘోషించేది.

వారందినములైన తరవాత మొగలు సైనికులు ఇద్దరు వ్యక్తు

లను చక్రవర్తి యెదుటికి తీసుకొచ్చారు. అప్పుడు చక్రవర్తి పాప నెత్తుకుని, అటూ యిటూ తిరుగుతున్నాడు. పాప సంతోషంతో చప్పట్లు కొడుతున్నది. వచ్చిన వాళ్లిద్దరూ రిచ్చపోయి చూస్తున్నారు. సైనికుల నడి విని చక్రవర్తి యిటు తిరిగాడు. వెంటనే పాపాయి "తాతా! తాతా!" అంటూ చక్రవర్తి భుజమీాంచి దిగి, ఆ యిద్దర్లో ముసలివానివద్దకు పరుగెత్తింది.

చక్రవర్తి తన వజీరుని పిలిపించి వాళ్లకి విలువైన దుస్తులిప్పించాడు. పాపాయికి పొక జాగీరిచ్చి, ఫర్మానా వ్రాయించాడు. ఆ బాలకి వెలగల దుస్తులూ, నగలూ, తన మెడలో వున్న అమూల్యమైన పతకమూ యిచ్చేడు. పాప వెళ్లిపోతూ "తాతా! మళ్లా వొస్తానూ" అన్నది. చక్రవర్తి పాప నెత్తుకుని, ముద్దాడి, కన్నీరు కార్చాడు. పాపాయి 'తాతా! యేడవకు. పోనీ ఇక్కడే వుంటానులే!' అంటే, చక్రవర్తి వొద్దని, విడవలేక, విడవలేక, విడిచిపెట్టాడు. చక్రవర్తికి పాపాయిలేని గుడారం, అంధకారమయమైంది.

బాలిక వెళ్లిన మర్నాడు చక్రవర్తి, తన పెద్దకుమారుడు, మొా అజాంకీ క్రిందివిధంగా జాబువ్రాసి పంపించాడు.

"ప్రియపుత్రున కాశిస్సులు—

నాకు దివ్యజ్యోతిసాన్నిధ్యము కలిగినది. సుమారు పది దినములు స్వర్గములో నున్నట్లుంటిని. ఆ చిన్నిజ్యోతి నాకు జ్ఞానోదయము కలుగజేసినది. నా జీవితమంతయూ వ్యర్థమైనదని తెలుసుకుంటిని. నేను చేసిన పొరపాట్లు నీవు చేయవద్దు. మరణకాలమందు మనతో ఏవియూ రావు. కపు యుద్ధము విరమించి అహమ్మదువగరము పోవుచున్నాను. అల్లా నిన్ను రక్షించుగాక.

నీ శ్రేయోభిలాషి, అవురంగజేబు." ★



# కాలక్షేపం



(4-వ పేజీ తరువాయి)

ఉన్నవనుటకు ఊరు పేరు సున్నయైన భగవంతుడే సాక్షి.

మనలో ఉన్న (*Soul Force*) ఆత్మశక్తి, అంతశ్శక్తి ఎంత అనంతమైనదో, ఎంత అద్భుతమైనదో మనకు అంతు చిక్కలేదు - లోతు అందలేదు. మన మహత్తు మనకే తెలియదు. మరణానంతరము యీ జీవుడు ఏమగునో మనము ఆమాటే తీయలేము. మన ఈ తరగతి, మన ఈ తరక్షణం సంగతి మనకు తెలియకుండా, గ్రుడ్డి ఎద్దు చేనిలో బడినట్లుగా, యీ ప్రపంచంలో గుడ్డిగా గడ్డి మేస్తున్నాము. మన భవిష్యత్తు మనకు తెలియదు. మనలో ఉన్న జీవము అనేది ఏమిటి? అది ఎటువంటిది? ఈ చైతన్యం, అనగా చిత్తు, మనకు ఎట్లా వచ్చింది? దాని సత్తా ఏమిటి? మన ఇంద్రియము లనెడి సి. ఐ. డి. పోలీసులద్వారా మనకు యీ ప్రపంచాన్నిగూర్చి లభిస్తున్న శాస్త్రీయజ్ఞాన మనెడి సంజాయిషీ సమాచార, సాక్ష్యాధారముల సంపుటి సంగ్రహ సారాంశం అంతా సత్యమా? అసత్యమా? మన భౌతిక దేహమునుగూర్చి, ఈ జడ జగత్తునుగూర్చి, మనకు తెలియవచ్చినదంతా సత్ (సత్యము) అగునో, కాదో? మన చిత్తమునకు ఇంద్రియములద్వారా దాఖలుచేయబడిన అనుభవజ్ఞానమను రికార్డు అంతా సత్యమని నమ్మి తలయూచి "చిత్తం! చిత్తం!" అనవలసినదేనా? మాటలు సేయనేల? మన మహత్తు, భవిష్యత్తు, సత్తు, చిత్తు, జగత్తు, కించిత్తు తెలియని మత్తులో, మాయామేయమైన గమ్మత్తులో, ప్రవర్తిస్తూ, పరిభ్రమిస్తూ, అవతరిస్తూ, అంతరిస్తూ ఉన్నాము.

ఇటువంటి మనవంటి రిక్తవ్యర్థ సంసారులచేత మహాయోగులు, మహర్షులు, పరమహంసలు, పరమపురుషులు, ప్రశంసింపబడి, కీర్తింపబడితే ఎంత? కీర్తింపబడకపోతే ఎంత? మన పొగడ్తలవల్లనూ, మన సర్టిఫికెట్లవల్లనూ, వారికి కలిగే కీర్తి ప్రశస్తి నాస్తి - గుడ్డిగవ్వ చేయని మన గుడ్డి మొద్దుబోడి బాతాఖానీ ఇచ్ఛకములవల్లనూ, రచ్చగొల్వ్యల మెరమెచ్చులవల్లనూ, పచ్చిపిచ్చి లొచ్చు ముచ్చు ముచ్చటలవల్లనూ, మనవంటి భజగోవిందముల భజన సంకీర్తనములవల్లనూ, ఆ మహాత్ములకు కీర్తిశరీరము ఏర్పడుట వట్టి హుళక్కి. మన కితాబులవల్ల వారికి ఏర్పడే కీర్తి మూర్తి కాల్తి శాశ్వతమనుట శాశ్వతమైన కల్ల.

"ప్రకట జరామరణ భయరహితంబుల్" అనదగినవి వారి ఆత్మలే గాని వారి కీర్తిశరీరంబులు కావు - కాజాలవు - కానేరవు. ★

సాహిణీ వారి "అమరసందేశం" లో నర్తకి హేమాంగినిగా పద్మిని.

# కన్యాశుల్కం

పి. పుల్లయ్యగారి దర్శకత్వాన వినోదా వారు నిర్మించనున్న "కన్యాశుల్కం" లో ప్రధానపాత్రల్లో ఒకటైన గిరీశం పాత్రను ఎన్. టి. రామారావు ధరించనున్నాడని తెలుస్తోంది. మధురవాణిగా సావిత్రి నటించనున్నదని పాఠకులకు విదితమే. రామప్ప పంతులుగా సి. ఎస్. ఆర్.' అగ్నిహోత్రావధాన్లుగా గోవిందరాజుల సుబ్బారావు, వెంకటేశంగా సుధాకర్ నటించవచ్చుననీ, లుబ్ధావధాన్లుగానో, కరటక శాస్త్రులుగానో ఎమ్. లింగమూర్తి నటించవచ్చుననీ తెలుస్తోంది. ఈ చిత్రం కోసం రికార్డు చేయబడిన "పూర్ణమ్మ" పాటను దానికి తగిన ఘట్టంలో 'ఫాంటసీ' గా చిత్రీకరించి ఉపయోగిస్తారట.



పక్షీరాజా వారి "అగ్గిరాముడు"లో ఋష్యేంద్రమణి, భానుమతి



నరసూవారి "రాజగురు" లో ఒక ఉద్రిక్త సన్నివేశం: గణేశన్, రంగారావు, కె. ఆర్. రామస్వామి.

# మళ్ళీ పౌరాణిక చిత్రాలు

## "ఈ పిహ పిక్చర్‌కి అయిందో పెద్ద ఫాక్చర్"

నాకు గల అభిప్రాయాలు రెండు మూడు చెబుతాను.

అయిదో క్లాసు జాగ్రఫీలో నారింజ పండు చుట్టూ ప్రయాణం చేసే చీమల్లాటివి; సినిమాలు కూడా. ఇప్పుడు నేనంటే మీరేమైనా అనుకుంటారు గాని, ఇలాంటి పరిస్థితి వస్తుందని నేను ఎనకనే అనుకున్నాను. ఆ పరిస్థితి రానేవచ్చింది కాబట్టి నాకు సంతోషంగానే వుంది. భక్త రామదాసుని చూడొచ్చు. (ఆంధ్రాపాల్ మునిగారికి ఈమధ్య తగిన పాత్రే దొరకటం లేదండీ, మరీనూ.) 'శశిరేఖాపరిణయా'న్ని చూడొచ్చు. ('మిస్సమ్మ' పేరును మార్చ లేదు కదా!?) శ్రీకృష్ణపరమాత్మ మళ్ళీ "పౌరాణిక చిత్ర సంస్థాపనార్థాయ" అవతరిస్తాడు. బహుశః ఇహ దేవుడు మేలుచేస్తే గోపికలూ, ఇంద్రుడూ, చంద్రుడూ, అహల్యా, తారా అంతా మళ్ళీ దిగివచ్చి పెరేడ్ చేస్తారు.

"సాంఘికాలు దెబ్బతినటమే కాని, పౌరాణికాలు డబ్బు చేసుకొంటాయని బుజువేమి" టన్నాడు మావాడు. "చంద్రహారం ఎంత బ్రహ్మాండంగా డబ్బు చేసుకుంది?" అంటాడు వాడు. (వాడి దృష్టిలో పౌరాణికాలూ, జానపదాలూ ఒకటే లెండి.) "ఇఫ్ వింటర్ కమ్స్, కెన్ స్ప్రింగ్ బి ఫార్ బిహైండ్?" మళ్ళీ సాంఘిక చిత్రాలు రాకుండా పోతాయటండీ? వస్తాయి. కాబట్టి సాంఘికాలు కావలసిన వాళ్ళంతా (హియర్ ప్లీజ్) ఆకాలం కోసమై ఎదురుచూడండి.

డబ్బులిచ్చి, "అయ్యా, మాకు విజ్ఞానం

# ★ మళ్లీ పౌరాణికచిత్రాలు ★

బోధించండి" అని అడిగితే, "అబ్బే, మీ సంగతి మాకు తెలియదుటండీ. మీకు కావలసింది వినోదమే. ఇదిగో అదే ఇస్తున్నాం (ఇస్తాం!) తీసుకోండి" అనే వారు నిర్మాతలు. (శైదివే మెయ్యప్పన్ గారి సినిమాపాటల పుస్తకం వెల అర్ధణాయే.) కాని నిర్మాతలు మాత్రం ఫ్రాంక్ పోల్సు. "స్వామీ, మేము హాంలెట్, దొ బిఘాజమీన్ లాంటి సినిమాలు తియ్యలేం. (ఒకవేళ తీసినా వాటికి డబ్బు వస్తుందని ఋజువులేదు.) వాటికి దగ్గర దగ్గరగా అలాంటివే అంటే వాటిలాంటి మొదలూ, చివరాగలవి మాత్రం తియ్యగలం. అలాగున తీస్తే మీరు వాటిని గౌరవించరాదను. కాబట్టే—" అంటారు వారు.

మన నిర్మాతలు తమలోగల వీక్‌నెస్‌ను కనిపెట్టేసుకుని, ఇంత నిర్మొహమాటంగా చెప్పేయటం సుగుణమే ననుకుంటాను. వాళ్ళంతా కలిపి ఎలాగా పౌరాణికాలు తీయదలచుకున్నారు కాబట్టి, వాళ్లదారిన వాళ్లని పోనిచ్చేకంటే చేయగలిగిందేమీ లేదు. ఏమంటే వారు ప్రారంభించిన చిత్రాలను ఎలాగూ ఆపుచేయరు. వాటన్నిటినీ సమ్మోహనాస్త్రాల్లాగా వదులుతారు. అలాంటప్పుడు మనం మొరపెట్టుకోవడం ఎవరిముందో శంఖం ఊదినట్టుంటుంది

పోతే, నేనుమాత్రం "ఈమీ పిక్చర్ కి-" అనుకుంటూ వారి అస్త్రపరంపరను సహింపదలచుకున్నాను. సాటి ప్రేక్షకుడి ఒక్కడివల్లా నిర్మాతలకు నష్టంరాదు కాబట్టి, కథ సుఖాంతమే.

"కెన్ స్ప్రింగ్ బి ఫార్ బిహైండ్?"

డి. కేశవరావు-విశాఖపట్నం.

*   *   *

## "ఇతివృత్తం మంచిదైతే"

ప్రస్తుతం నిర్మింపబడనున్న చిత్రాలలో పౌరాణికచిత్రాల సంఖ్య ఎక్కువగా నున్నందువల్ల ప్రేక్షకలోకంలో గాలి దుమారం బయల్దేరింది. శాస్త్రీయ విజ్ఞానం బాగా వ్యాపించిన ఈ 20 శతాబ్దంలో ఆ కట్టుకథ లెవరిక్కావాలి అని అనేకమంది అభిప్రాయపడుతున్నారు. ప్రస్తుత పరిస్థితులలో పౌరాణిక చిత్రాలనాదరించే ప్రేక్షకులు ఎవ్వరూ లేరని, కనుక అవి విడుదలైతే తప్పక ఆర్థికంగా ఘోర పరాజయం పొందగలవని కొందరు వాదిస్తున్నారు.

నా అభిప్రాయంలో, పౌరాణిక చిత్రాలు ఆర్థికంగా పరాజయం పొందవు. చిత్రం పౌరాణికమైనా, సాంఘికమైనా జానపదమైనా, చరిత్రాత్మకమైనా, ఇతివృత్తం ఆకర్షవంతంగా ఉంటే ప్రజలు తప్పక ఆదరిస్తారు. సాంఘికచిత్రాలు తప్ప యింకే చిత్రాలు చూడమని ప్రేక్షకులు శపథం చెయ్యలేదు. అసలు, ప్రేక్షకులు ఈమధ్య వచ్చిన సాంఘిక చిత్రాలెన్నింటికో స్వస్తివాచకం పలికారు. సాంఘిక చిత్రం పేరిట అనవసర, అసహజ సన్నివేశాలలో చిత్రాన్ని నిర్మించితే ప్రేక్షకులెవ్వరూ ఆదరించరు. నీతి, ఆదర్శం, లేని చిత్రాలు ఎందుకూ పనికిరావు. సాంఘిక చిత్రాలలో నూటికి తొంభై చిత్రాల యితివృత్తం ఒకేవిధంగా ఉంటోంది.

ఈ చెత్త ప్రేమగాథలు యువతీ యువకులలో అణగి మణగి యున్న కామోద్రేకాన్ని రెచ్చగొడుతున్నాయి.

కనుక, ప్రస్తుత పరిస్థితులలో ప్రజలను సన్మార్గంలో పెట్టి వారి సౌశీల్యం పెంపొందించే పౌరాణిక చిత్రాల ఆవశ్యకం ఎంతైనా ఉంది. పౌరాణిక చిత్రాలైతే డబ్బు రాదనుకోవడం తెలివితక్కువే అవుతుంది. బి. ఎన్. రెడ్డిగారన్నట్లు "ఇతివృత్తి మేదైనా ప్రదర్శన బాగుంటే తప్పక విజయవంతి మాతుంది." పౌరాణిక చిత్రాల వల్ల ప్రజలలో దైవభక్తి, పాపభీతి పెంపొందగలవు. మన ప్రజలకు ధర్మ, మత, దైవచింతన మెక్కువ. మహాత్ములకు, మహాపురుషులకు, పతివ్రతలకు, భక్తులకు, వేదాంతులకు మన దేశం పుట్టిల్లు అన్న విషయం మనం మరువకూడదు. రామాయణ, మహాభారతాలలోని ముఖ్యాంశములను కొన్నింటిని తీసుకొని తెరకెక్కిస్తే అవి తప్పకుండా విజయవంతమౌతాయి. అందులో అణుమాత్రం అనుమానం లేదు. కనుక నిర్మాతలు పౌరాణికచిత్రాలను తీసేందుకు భయపడనక్కరలేదు.

హెచ్. శ్రీనివాసరావు-నెల్లూరు.

*   *   *

## "పౌరాణిక చిత్రాలవైపు తిరోగమనం"

పై శీర్షికతో "ఆంధ్ర పత్రిక"లో "పహరా"గారు వ్రాసిన వ్యాసంలో చాలవరకు మన నేటి సినిమాపరిశ్రమనుగురించి చక్కగానే విమర్శించారు. మన నిర్మాతలు సాంఘిక చిత్రాలు తీయటం చేతగాకే పౌరాణిక చిత్రాలు తీస్తున్నారనే విషయం నిర్వివాదాంశం. మొట్టమొదట పౌరాణికాలు విజయవంతమైతే అవే నిర్మించారు. తరువాత జానపద చిత్రాలు విజయవంతం కావటంచూసి, దాదాపు అందరూ జానపద చిత్రాలు తీశారు. ఐతే ఆ చిత్రాలన్నీ దాదాపు అన్నీ ఒకే ఫక్కీలో నడిచి క్రమంగా ప్రజాదరణ పోగొట్టుకున్నై. అప్పట్లో విడుదలైన ఒకటిరెండు సాంఘిక చిత్రాలు బాగా విజయవంతమవటం గుర్తించి సాంఘికచిత్రాలు నిర్మించటం ప్రారంభించారు. క్రమంగా మనవారు జానపద చిత్రాలలో మాదిరిగానే సాంఘిక చిత్రాలలోను నూతనత్వం కాపాడుకోలేక పోయారు. అందువల్లే ఈమధ్య విడుదలైన సాంఘికచిత్రాలు కొన్ని బాగా దెబ్బతిన్నవి. ఐతే వాటిలో కథాలోపమే అవి దెబ్బతినటానికి కారణం అనే విషయం మన నిర్మాతలకు అర్థం కాలేదనుకుంటాను. మన నిర్మాతలు వారి సాంఘిక చిత్రాలలోని లోపాల్నిగాని, ప్రజలలో బయలుదేరిన హేతువాద అభివృద్ధినిగాని గమనించకపోవటం మన దురదృష్టం. అందుకు వారు ప్రయత్నించనూ ప్రయత్నించరు. తలా తోకా లేని కథల్ని తెరకెక్కించి డబ్బురాకపోతే "ఆడలేక మద్దెలఓడు" అన్నట్లుగా సాంఘిక చిత్రాలను ప్రజలు ఆదరించటంలేదు అని మళ్లా మొదటికి వచ్చారు. అంటే పౌరాణిక చిత్రాలు ప్రారంభించారు. అదీగాక ఈ మధ్య విడుదలైన కొన్ని హిందీ పౌరాణిక చిత్రాలు (నాగపంచమి మొ॥) విజయం మన నిర్మాతలను బాగా ఆకర్షించింది. మొదటినుంచి హిందీవారిని అనుకరించటానికి అలవాటుపడ్డమనవారు, తాముకూడ పౌరాణికచిత్రాలు తీయటం ప్రారంభించారు. పోనీ అదైనా ఇదివరకు తీయని కథలను, కొత్తరకంగా తీస్తున్నారా అంటే అదీలేదు. ఇదివరకు తీసినకథలనే తిరిగి నిర్మించటం మొదలుపెట్టారు. విచిత్రమేమిటంటే, మొన్నటివరకు చక్కటి సాంఘిక చిత్రాలు తీయగలరని పేరుపొంది, కొమ్ములు తిరిగిన నిర్మాతలు సైతం పౌరాణికచిత్రాలు తీయటం ప్రారంభించారంటే, వీరిలో నిరాశావాదం ఎంతగా ప్రబలిపోయిందో అర్థంకాకుండా వుంది. వీరు హిందీవారిని ఎందుకింత గుడ్డిగా అనుసరిస్తారో మనకర్థంకాదు. ప్రజలలో కలిగిన చైతన్యం సరిగ్గా అర్థం చేసుకోకుండా, ఈ పౌరాణికచిత్రాలు నిర్మిస్తున్నవారికి అది ఎంతవరకు సమర్థనీయమో, భవిష్యత్తే నిరూపించగలదు.

ఎ. సాంబశివరావు-తెనాలి.

# "వ్యాపార చిత్రాలు"

కొన్నాళ్లక్రిందట సి. పి. రామస్వామి అయ్యర్ గారు "అవ్వయ్యార్" చిత్రాన్ని శ్లాఘిస్తూ, "భారతదేశంలో అధ్యాత్మిక చింతన అభివృద్ధి అవుతోంది. దీనికి తార్కాణం అధ్యాత్మిక చిత్రమైన 'అవ్వయ్యార్' చిత్రాన్ని ప్రజలు విరివిగా చూసి ఆనందించడమే" అని అన్నారు. అయితే ఆయనమాటల్లో పూర్తినమ్మకం లేకపోవడంవల్ల కాబోలు ఆ చిత్రనిర్మాత మళ్ళీ అటువంటి చిత్రం తీయ సంకల్పించలేదు.

ప్రజాస్వామిక దేశాల్లో ఏ ప్రైవేటు వ్యాపారమైనా సంఘ శ్రేయస్సునూ, సంఘావసరాలనూ దృష్టిలో పెట్టుకుని సాగించబడుతుందని ఆశించడంకంటె పొరపాటు ఉండదు. ఈ దేశాల్లో వ్యాపారం యొక్క ప్రధానాశయం ఆయా వ్యాపారుల స్వంతలాభాలు. స్వంతలాభానికి అనుకూలించేదిగా ఉంటేనే ఏ వ్యాపారమైనా సాగించబడుతుంది. స్వంతలాభానికి అనుకూలించకపోతే, ఆ పనివల్ల ఎంత సాంఘిక ప్రయోజనమున్నా ఎవరూ దాని జోలికి పోరు.

చిత్రనిర్మాతలు తాము ప్రజలకు వినోదం కలగజేయడానికే ఫిలిం వ్యాపారం చేస్తున్నామనీ, ప్రజలకు వినోదం ప్రధానావసరాల్లో ఒకటి గనుక ఆ అవసరం తీర్చడమే తమ లక్ష్యమనీ అంటారు. ఇది కేవలం తమనీ, ఇతరులనీ నమ్మించడానికేగాని మరేమీ కాదు. ప్రజలకి వినోదం సరఫరా చెయ్యడంద్వారా డబ్బు చేసుకోవచ్చుననే ఆశయే లేకపోతే ఎవరూ చిత్రనిర్మాణం జోలికిపోరు. అంతేకాదు, అసలు సినిమాచిత్రాల ద్వారా వినోదం పొందడమనేదాన్ని, ప్రజలకు ఒక అవసరంగా మార్చినవారు కూడా సినిమా వ్యాపారులే.

సినిమాలు తీసేవారు సినిమాలను వ్యాపారవస్తువులుగానే పరిగణించుతారు కనుక, ఏ రకం సినిమాలుతీస్తే సునాయాసంగా, త్వరగా తమ డబ్బు తిరిగి వస్తుందో, ఆ సినిమాలే తీయడానికే ప్రయత్నిస్తారు. అటువంటి కథలకోసమే తమ శక్తియుక్తులు ధారపోస్తారు. కొన్ని సెన్సార్ నిబంధనలకు లోబడి ఎటువంటి కథలను, ఎటువంటి విధంగానైనా చిత్రాలు తీయడానికి సినిమా వ్యాపారులకు పూర్తి స్వాతంత్ర్యమున్నది. వీరిని శాసించగలిగినవారు ఒక్క ప్రజలే. ప్రజాభిరుచులను 'కనిష్ఠ సామాన్య ప్రమాణం'లో అంచనాకట్టి ఆ ప్రకారం సినిమాలు తీయడం ఈ వ్యాపారులకు పరిపాటి.

ప్రస్తుత ప్రజాస్వామిక పరిస్థితులలో సినిమా వ్యాపారంనుండి సాంఘిక ప్రయోజనాలను ఆశించడం ఎండమావులపై ఆశపెట్టుకోవడం వంటిదే అవుతుందని మొదట చెప్పాను. ఇంతవరకు ఈదేశంలో తయారైన చిత్రాల్లో సాంఘిక ప్రయోజనం ప్రధానంగా పెట్టుకుని తీసిన చిత్రాలను లెక్కపెట్టడానికి ఒక చేతివేళ్లు కూడా ఎక్కువేనని నా నమ్మకం. విద్యావిధానం యొక్క, కళలయొక్క పరమ ప్రయోజనం మానవుణ్ణి బాధ్యతాయుతుడైన సంఘజీవిగ, పౌరుడుగా తయారుచెయ్యడం. ఇప్పటి వ్యవస్థలో మన విద్యావిధానంగాని,



కొలంబియావారి "కెయిన్ మ్యూటినీ"లో జోస్ ఫెరర్, వాన్‌జాన్సన్, హంఫ్రీ బొగార్ట్.
కెయిన్ అనే అమెరికన్ నౌకపై జరిగిన తిరుగుబాటు ఈ చిత్రంలో ఇతివృత్తం.



ఛాయాపిక్చర్ & రేవతీస్టూడియోస్ వారి "బాలసన్యాసమ్మ" ప్రారంభోత్సవం జూలై 22 వ తేదీన రేవతిలో జరిగింది. ఆ సందర్భంలో తీసిన పై ఫొటోలో సముద్రాల (రచన), వంగర (నటుడు), పి. సుబ్బారావు (నిర్మాత), ఎస్. రాజేశ్వరరావు (సంగీతం), టి. వి. ఎస్. శర్మ (ఆర్టు), మొదలైనవారిని చూడవచ్చును. లీల, రాణి, వగైరాలు పాడిన రెండు బృందగీతాలు ఆరోజున రికార్డు చేశారు.

# మళ్ళీ పౌరాణిక చిత్రాలు

క్రమంగా వ్యాపార వస్తువులైపోతున్న కళలుగాని ఈ ప్రయోజనానికి ఏమాత్రం పనికొచ్చేవిగా లేవని వేరే చెప్ప నవసరం లేదు. ముఖ్యంగా అన్నిటికంటె విపరీతంగా వ్యాపార వస్తువులుగా తయారైన సినిమాలు పైన చెప్పిన సాంఘిక ప్రయోజనానికి ఆమడల దూరంలో ఉన్నాయి.

సమాజంలో అమలులో ఉన్న ఆర్థిక వ్యవస్థయొక్క ప్రభావం ఆ సమాజపు రాజకీయాలమీద, సంస్కృతిమీద, కళలమీద, విద్యావిధానంమీద, అన్నిటిమీద పని చేస్తుందంటే అంగీకరించనివారు అనేకులున్నారు. వీరికి ఒక్కముక్కలో సమాధానం చెప్పవచ్చును. ఈ ఇరవైయవ శతాబ్దంలో 'సినిమా' అనే ఒక కొత్తకళ పుట్టింది. ప్రజాస్వామ్య దేశాలలోని ఆర్థిక వ్యవస్థ మూలంగా ఈ కళ పుట్టిన క్షణంనుంచే వ్యాపారవస్తువైపోయింది. సినిమాలను వ్యాపారంగా కాక మరొకవిధంగా నడపడానికే వీలులేదు. చలనచిత్ర చరిత్రలో ఉత్తమ కళాత్మక చిత్రాలు కొన్ని చెదురు మాటుగా వచ్చినా ఇవి లెక్కించదగినవి కావు. భారీ ఎత్తున జరిగే సినిమా వ్యాపారంలో ఇవి సముద్రంలో కాకి రెట్టలవంటివి. కళలమీద ఆర్థికవ్యవస్థ ప్రభావానికి ఇంతకంటె మంచి నిదర్శన మేమి కావాలి?

* * *

ఈ స్థితిలో తెలుగులో కొందరు నిర్మాతలు మళ్ళీ పౌరాణికచిత్రాలు తీయడం వాకేమీ వింతగా లేదు. రామస్వామి అయ్యర్‌గారనుకున్నట్లు ఇది దేశంలో ఆధ్యాత్మిక చింతన ఎక్కువౌతోందనడానికి తార్కాణం కాదు. ఏ రకం చిత్రం తీస్తే జనం ఎగబడతారని తోస్తే ఆరకం చిత్రాన్నే నిర్మాత తీస్తాడు. "సాంఘిక" చిత్రాలు నిర్మించిన వారంతా సంఘ సంస్కారులు, "జానపద" చిత్రాలనే పేరుతో ఇష్టంవచ్చినట్లు కథలల్లి చిత్రాలు తీసినవారు మన జనపదాలలోని జాతీయ సంస్కృతిపై అభిమానం కలవారూ కారు. అలాగే పౌరాణిక చిత్రాలు, భక్తుల జీవిత చిత్రాలు తీసేవారందరూ చనిపోయిన భారతీయ అధ్యాత్మిక ఔన్నత్యాన్ని పునరుజ్జీవింప జేసేవారు కారు. ప్రస్తుతం తెలుగు సినిమా పరిశ్రమలో అనేకులు ఋణాంధువానికి అంటుకుపోయారు. ఋణాంధువంనుండి పెకల్చుకొని ధనధ్రువాన్ని చేరుకోవాలని వీరు చేసే ప్రయత్నాలే ఈ పౌరాణిక చిత్రాలు.

దేశంలో ముఖ్యంగా పల్లెటూళ్ళ ప్రాంతాలలో పురాణాలమీద విశ్వాసం ఇంకా అపారంగా ఉంది. ఈ విశ్వాసాన్ని ఆధారం చేసుకుని, ప్రజలలో దేవుడిమీద, దేవతలమీద, వారి మహిమలమీద ఉన్న నమ్మకాలను అడ్డం పెట్టుకుని, సాంఘిక చిత్రాలలో ఎబ్బెట్టుగా కనిపించే ఖరీదైన సెటింగులను, చిత్రవిచిత్రమైన దుస్తులను, సెక్సు ఆకర్షణలను స్వేచ్ఛగా ప్రదర్శించి డబ్బు చేసుకోవడానికి పౌరాణిక చిత్రాలు బాగా వీలిస్తాయి.

పురాణాలలోని కథలు వందలకొలదీ సంవత్సరాలుగా కాలప్రవాహానికి ఎదురీది, ఈనాటికీ నిలబడి ఉన్నాయి. ఇవి రెడీమేడ్ దుస్తులలాగ తయారుగా ఉన్న కథలు. ఇంతకంటె మంచి 'డ్రామా' కలిగిన కథలు సృష్టించడం ఇప్పటి సినిమాపరిశ్రమలోని వారికి తలకు మించిన పని. శ్రమలేకుండా తయారుగా ఉన్న ఈకథలను వాడుకోవడం మేలని పలువురు నిర్మాతలు వీటిపై పడ్డారు.

ఇక పోతే, ఈమధ్య అడపా తడపా విడుదలవుతున్న పాత పౌరాణిక చిత్రాలు కొత్తగా తయారైన సాంఘిక, జానపద చిత్రాలకంటె ఎక్కువడబ్బు చేసుకుంటున్నాయట. ఇది కొంతవరకూ నిజమే అయిఉండాలి. లేకపోతే మన నిర్మాతల దృష్టి మళ్ళీ పౌరాణికాలవైపు తిరిగి ఉండదు.

కనుక ఇప్పుడు మళ్ళీ తెలుగు చిత్రసీమలో పౌరాణిక శకం ప్రారంభ మవడంలో ఆశ్చర్యంలేదు. అసలు నన్నడిగితే మన చిత్రసీమలో పౌరాణిక శకం అంతం కానేలేదు. సాంఘిక జానపద చిత్రాల పేరుతో ఇంతవరకూ పౌరాణిక చిత్రాలే మన నిర్మాతలు తీస్తున్నారు. (అతి స్వల్ప సంఖ్యాకమైన కొన్ని చిత్రాలు మినహా.)

—ఎన్నార్.

# "సుబ్బారాయుడు" నాటకం

ఛాయా నాట్యనికేతన్ అనే నాటక బృందంవారు జులై 25 న మద్రాస్, సౌందర్యమహాల్‌లో ముక్కపాటి వరసింహశాస్త్రి గారి "సుబ్బారాయుడు" నాటకం ప్రదర్శించారు. పడుచుపిల్లను పెళ్ళిచేసుకోబోయి అవమానం పొందిన సుబ్బారాయుడుగా వంగర వెంకట సుబ్బయ్య బాగా నటించారు. గీతారాణి, జయశ్రీ, సావిత్రి, ఎమ్. సూర్యం, బి. వి. రావ్, ఎ. వరసింహారావు, జి. ఎన్. భూషణ్, గోపాలం, ఆర్. వెంకటేశ్వరరావు, టి. కె. విశ్వనాథ్ ఇతర నటీనట వర్గం.

# విప్రనారాయణ

చోళరాజ్యపు చరిత్రాత్మకవాతావరణం కలిగిన "విప్రనారాయణ" కథను భరణీ వారు శీఘ్రగతిని నిర్మిస్తున్నారు. విప్రనారాయణుడు మహాభక్తుడు; దేవదేవి నర్తకి. వీరిద్దరి ప్రేమగాథను చూపించే ఈ చిత్రంలో విప్రనారాయణుడుగా నాగేశ్వరరావు, దేవదేవిగా భానుమతి, రంగరాజుగా రేలంగి నటిస్తున్నారు. నిర్మాత, దర్శకుడు రామకృష్ణగారు ఈ చిత్రాన్ని అక్టోబరులో విడుదలచేసేందుకు చురుకుగా పనిసాగిస్తున్నారు. సముద్రాలవారు సంభాషణలు, పాటలు వ్రాస్తున్నారు. రాజేశ్వరరావుగారు సంగీతం సమకూరుస్తున్నారు. ఇటీవల వచ్చిన సాంఘిక, జానపదచిత్రాల దృష్ట్యా ఈ చిత్రం ప్రేక్షకులకు ఒక కొత్త ఆకర్షణ కాగలదని భావించబడుతోంది.

# దోబిఘా జమీన్ కు

## జెక్ బహుమతి

జెకోస్లోవాకియాలో కార్లోవి వారీలో జరిగిన ఎనిమిదవ అంతర్జాతీయ చలనచిత్రోత్సవం జూలై 25న ముగిసిన సందర్భంలో "సంఘాభ్యుదయానికై కృషి" అనే శీర్షిక క్రింద ఒక బహుమతి భారతీయ చిత్రం "దో బిఘా జమీన్"కు, మరొక బహుమతి పోలిష్ చిత్రం "సెల్యులోస్"కు వచ్చాయి. గ్రాండ్ ప్రైజ్ బహుమతులు సోవియెట్ చిత్రం "ట్రూ ఫ్రెండ్స్"కు, అమెరికన్ చిత్రం "సాల్ట్ ఆఫ్ ది ఎర్త్"కు వచ్చాయి. ఉత్సవంలో 29 దేశాలు పాల్గొన్నాయి. శాంతి బహుమతులు తూర్పు జర్మనీలో తయారైన "ఎర్నెస్ట్ థాల్మన్ — సన్ ఆఫ్ హిజ్ క్లాస్"కు, జాపనీస్ చిత్రం "చిల్డ్రన్ ఆఫ్ హిరోషిమా"కు ఇవ్వబడినై.

ఈ ఉత్సవానికి జెకోస్లోవాకియా అధ్యక్షుడు జపోటకీ హాజరయ్యారు.

# వెనిస్ ఉత్సవం

వెనిస్ లో ఏటా జరిగే అంతర్జాతీయ డాక్యుమెంటరీ చిత్రోత్సవంలో "*Back of Beyond*" అనే ఆస్ట్రేలియన్ సాంస్కృతిక చిత్రానికి ప్రథమ బహుమతి వచ్చింది. పిల్లల చిత్రాల్లో ప్రథమ బహుమతి కూడా ఆస్ట్రేలియన్ చిత్రమే అయిన "*Down in the forest*"కు వచ్చింది. ఆస్ట్రేలియాలోని కంగారూ, కోవలా, తదితర మృగాల జీవిత విశేషాలు ఈ 'ఫాంటసీ' చిత్రంలో వచ్చాయి. వీటిలో బ్రిటన్, ఇటలీ, మనోహరంగా చూపబడ్డాయి. ఈ ఉత్స పోలెండ్ మొదలైన 18 దేశాల చిత్రాలు వానికి 26 దేశాలనుంచి 100 చిత్రాలు బహుమతులు పొందాయి.





విక్రమ ప్రొడక్షన్స్‌వారి "మా గోపి" లో ప్రభావతి, రేలంగి.

# ముగ్గురు మర్త్యులు

(9-వ పేజీ తరువాయి)

భూషణుడి ప్రవృత్తిలో ఎలాంటి మార్పునీ బహిర్గతం చెయ్యలేకపోయేయి. "అసంగతి విన్నాను." అని అతిసహజమైన ధోరణిలో అన్నాడు.

ఇంత నిర్లిప్తత ప్రకటిస్తాడని వాసంతి బహుశా అనుకుని వుండదు. ఆ విషయాన్ని కప్పిపుచ్చుటానికి ఇంకా ఇలా అంది: "జంక్షను గనక మనూరు స్టేషన్లో నే మీ స్నేహితురాలు రైలు మారాలికదా ఒక మారు మనింటికి రమ్మని అడక్కూడదండీ?"

"దేనికని?" ఆశ్చర్యపోతూ అడిగేడు శశిభూషణుడు.

"దేనికేమిటి?" నా కావిడ్ని చూడాలనుండకూడదేమిటి?" అంటూ అక్కణ్నుంచి వెళ్ళిపోయింది వాసంతి.

నిజానికి శశిభూషణుడు స్నేహితురాల్ని రమ్మనలేదు. ఇంకాలం తర్వాత తనంతట తనే వచ్చింది మల్లిక. అప్పు, వాసంతి బుర్రలో ఏవిధమైన ఆందోళనకానీ, ఎలాంటి అనుమానాలుకానీ లేవు. అమాట కొస్తే వాసంతి మనసులో ఎంతో సంతోషించింది. మల్లికని రప్పించి, ఆమెకు తను సాధించిన విజయాన్ని, తను చిక్కబట్టుకున్న అదృష్టాన్నీ చూపించాలని వాసంతి అభిలాష - ఇన్నాళ్ళాయి తను పడిన ఆందోళనకి ఇదో దిగతుడుపులాగ.

* * *

అవతల గదిలో వాళ్ళింకా కబుర్లు చెప్పుకుంటున్నారు. దేన్ని గురించి మాటాడుకుంటున్నారో? ఏవిట్లో కానీ తను పట్టించుకో నవసరంలేదు. తను భయపడాల్సిందేమీ లేదని వాసంతికి తెలుసు.

ఈ నిమిషాన కాని స్టవ్ 'బర్స్టు' ఐపోతుందా?

హఠాత్తుగా తట్టిన ఆలోచనకి వాసంతి ఒళ్లు జలదరించింది. అలా అయ్యేపక్షంలో మల్లిక ఏమనుకుంటుంది? అప్పుడామెకు ఎంత తప్పుడు అభిప్రాయం కలుగుతుంది! ఈ విషాదకరమైన ముగింపుకి మూలకారణం తనే అని ఆమె అనుకోవచ్చు. ఏనాడో అణగారిన ఆందోళనంతా తన రాకతో ఒక్కమారు గుప్పుమని పెలుకొచ్చింది. ఆమె తప్పకుండా అనుకుంటుంది.

వీల్లేదు! ఏది ఏమైనప్పటికీ ఈ అల్పపు సంతృప్తి పొందడానికి మల్లికకి అవకాశం చిక్కనియ్యకూడదు. స్టవ్ ఆర్పెయ్యటానికి మరి తిప్పటానికి ముందుకు జరిగింది వాసంతి. ఇంతలో అంత గట్టిగా ఎలా బిగుసుకుపోయిందో మరి? తన బలాన్నంతా ఉపయోగించినా తిప్పలేకపోయింది మరని. ఆయన్ని పిలిస్తే? అనుకుంది, భయంవేసి. కానిపిలుస్తే చేతు మల్లికముందు తనకి నామర్దా కాదూ

నిజంగా ఉగ్రరూపం దాల్చినట్టు భయంకరంగా ఒక పెనుఘోష పెడుతోంది స్టవ్. లేచి, స్టవ్‌కి దూరంగా కూచుందామనుకూడా వాసంతి తట్టలేదు. తన బలాన్నంతా ఉపయోగించి మరని తిప్పటా తంటాలు పడుతోంది. ఏది ఏమైనాసరే ప్రమాదం ఏదీ జరగటానికి ఆమె ఇవ్వ ఒప్పుకోదు.

ఆగష్టు 5 విడుదల





పక్షిరాజా వారి

# అగ్గిరాముడు

నిర్మాత. దర్శకుడు: యస్. యం. శ్రీరాములు నాయుడు

భానుమతి ★ యన్. టి. రామారావు ★ రేలంగి

ముక్కామల. నటించిన విప్లవాత్మక చిత్రము




ప్రఖ్యాత 'నాజర్ దళము వారి "అల్లూరి సీతారామరాజు

జీవిత చరిత్ర" బుర్ర కథ చేర్చబడినది.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.




సంపుటము 47
సంచిక 47
4.8-54

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

జయ శ్రావణ శుద్ధ పంచమి బుధవారం

సావాసగత్తెలు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి పుష్పలత.



లోపలి కవరు చిత్రం :-
"రవల వెలుగుల గంగ"
ఫోటో : నాళం రామేశ్వరరావు
—రాజమండ్రి.

వెనుకపక్క కవరు చిత్రం :-
శిశిరశోభ
ఫోటో: పి. సి. ఎమ్. ఈశ్వరబాబు.

### పంచతంత్రం - గమనిక

కారణాంతరాలవల్ల పంచతంత్రం-లబ్ధనాశం ప్రస్తుతానికి ప్రచురించలేకపోతున్నందుకు చింతిస్తున్నాం. తిరిగి త్వరలోనే - నాలుగైదు వారాలలో ప్రచురణ సాగించగలం.

# దసరా సంచిక

## పిల్లలకు ప్రత్యేకాకర్షణ

## కథలు, గేయాలు, చిత్రాల రచనలో పోటీ

రాబోయే 'విజయదశమి' పండుగకు (1954 అక్టోబరు 6 వ తేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. బాల బాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాశక్తిని ప్రోత్సహించడానికిగాను పోటీ పెడుతున్నాము. ఈ పోటీలో ఒక మంచి కథకు, ఒక మంచి పాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతులివ్వబడుతాయి.

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్లలోపు బాల బాలికలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనవచ్చును.

* కథలు, గేయాలు, బొమ్మలు, స్వతంత్రమైనవై ఉండాలి.

* కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.

* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం పైనకాని సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్‌తోగాని పెన్సిల్‌తోగాని వ్రాసి పంపాలి.

* రచనలు, బొమ్మలు **1954 ఆగస్టు 21 వ తేదీలోగా** మాకు చేరేవిధంగా పంపాలి.

* రచయితలు, చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతోపాటే వ్రాసి పంపాలి.

* స్వీకరించబడని రచనల్ని, బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపులు కూడా చేర్చి పంపాలి.

* కవర్లపైనా లేక లేకర్లపైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక దసరా పోటీకోసం" అని

# కాలక్షేపం

సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయనిధులు - సుమ్మీ! తదీయా
ధిక కీర్తి శరీరంబులు
ప్రకట జరామరణ జన్మ - భయరహితంబుల్.

తా॥ మంచికృతులు రచించినవారుగాని పుణ్యాత్ములుగాని; నవరసములను ఒప్పించుటలో సిద్ధహస్తులైనవారుగాని, పాదరస యోగవిద్యయందు సిద్ధిపొందిన యోగులుగాని; మంచి కవీంద్రులుగాని, త్రికాలవేదులగు యోగులుగాని, సర్వమును జయించెడి సంకల్ప సిద్ధులు. ముసలితనమును మరణభయమును అతిక్రమించిన యోగులవలె ఆ రెండింటివల్ల భంగము కానటువంటి వారి కీర్తి శరీరము స్థిరస్థాయిగా ఉంటుంది.

ఏదైనా ఒక మహాకావ్యం రచించి దానిని ఎవరికైనా అంకితం యివ్వడం కవికి అవసరమా? లేక, అంకితం పొందడం కృతిపతికి అవసరమా? అనే విషయం చాలా కాలంవరకు కవులు చర్చించుటకు తగులుకోలేదు. కొంతకాలానికి బమ్మెరపోతరాజుగారు ఉద్భవించి కృతికర్తలకూ కృతిపతులకూ మధ్య జరుగుతూ ఉండే భాగవతం అంతా బట్టబయలు చేసివేశారు, గోపికా వస్త్రాపహరణం లాగున.

"తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతం బూనితిన్"

అని మాత్రమే ప్రతి ఆంధ్రుణ్ని చదువు ప్రారంభించవలసినదని పోతన్నగారు శాసించారు. "సరస్వతీదేవిని ప్రార్థించు-ఆ చదువుల తల్లి దయవల్ల చదువు నేర్చి, చక్కని పండితుడవై, కవివై, కావ్యాలు వ్రాయి. ఆ చదువుల తల్లికే ఆ కావ్యాన్ని సమర్పించు. ఆమె నీకు యిచ్చిన విద్య అది. ఆమె కృపాకటాక్ష వృష్టివల్ల నీ హృదయ క్షేత్రంలో పండిన పంట నీ రసభరిత పద్యరాసులు. దేవునిమాన్యంలో పండినపంటను దేవుని ధూపదీపారాధనలకూ, ఉత్సవకైంకర్యాలకూ నిత్యకృత్యనైమిత్తిక నైవేద్యాలకూ వినియోగించాలి. నీవు ఆ ప్రసాదం స్వీకరించి లోకులకు పంచిపెట్టుతూ ఉండాలి. అంతేగాని, సకలసద్గుణనికురుంబయగు శారదాంబకు నివేదించవలసినపంటను పెంటపాడు సంతలో అమ్మివేసి, ఆ పైకం దక్కగా జేబులో వేసికొని "దాక్షారామ పురీ విహార వర గంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ కుంభికుంభములపై" కస్తూరి కలిసిన గంధమును మస్తుగా పూయుటకు బండీ ఎక్కి ప్రయాణమయ్యే పండితుడు, పండిన పంటను దుర్వినియోగం చేసినవాడవుతాడు"—ఇదే బమ్మెర పోతన్నగారు కవిమండలికి నేర్పిన భాగవతనీతిసారము.

కృతిని అంకితంపొందడం అనేది సప్తసంతానములలో చేరింది. తనకు పుట్టిన బిడ్డమూలంగా తన కీర్తి ఎంత శాశ్వతంగా ఉంటుందో, యించుమించుగా అంతటి శాశ్వతమైన కీర్తిని కృతి సంకితంపొందడం మూలంగా గడించవచ్చునన్నారు. రామాయణంవంటి పవిత్రమైన మహాకావ్యం ప్రపంచంలో కలకాలం చెక్కుచెదరని రసగుళికవలె, జీవనదియైన గంగవలె, మనుజుల మనోవేదనల తొలగించి ఆత్మానందం కలుగజేసి సర్వ కళ్యాణకల్పకమై శుభోదర్కమై, ఆ చంద్రతారార్కముగా ఆర్యలోక పూజితమై విరాజిల్ల గలదు. కనుక, అటువంటి మహాకావ్యమును అంకితము పొందినటువంటి కృతిభర్త పేరుకూడా ఆ కావ్యములో భాగంగా చేరియుండినట్లయితే, ఆ కావ్యంతోపాటు, కృతి భర్త పేరు కూడా శాశ్వతంగా ఉంటుంది—నిజమే. కాని, తన పేరు మాత్రమే స్థిరస్థాయిగా లోకంలో ఉండవలెననే ప్రాకులాటగాని, ఆవులపాటుగాని ఎందుకు? తన ఆత్మ పరిపక్వం కావాలని కోరుకోవాలి. అంత పెద్ద కోరిక లేకపోతే తాను ఆయురారోగ్యములతో భాగ్యభోగ్యములతో ఐహిక దైహిక సుఖం అనుభవించాలని కోరుకోవాలి. అంతేగాని తన దేహంలో ఆరోగ్యం లేకపోయినా సరే, తన ఆత్మకు శాంతి లేకపోయినా సరే, తన పేరుమాత్రము గొప్పగా కొండంతగా, ఎల్లదేశాలవారూ, ఎల్లకాలమూ చెప్పుకుంటూ ఉండవలెననే కోరిక ఎవనికైనా ఎందుకు కలగాలి? ఇంట్లో గబ్బిలములకంపు కొట్టుచున్నప్పటికీ, ఇంటిపేరు కస్తూరివారు అని ఉండాలి. ఇంటిలో యీగలమోత ఉన్నప్పటికీ, బయట సవారీమోత ఎక్కువగా ఉండాలి. తాను త్రాగేది అంబలి అయినప్పటికీ, తన మీసాలను పైకి ఎత్తిపట్టుట కొకడు తైనాతీగా ఉండాలి. రాజువేషానికి కిరీటం కావాలి - భుజకీర్తులు కావాలి. కవులు కీర్తించాలి. ఇదంతా రాజువేషానికి కావలసిన సింగారం-ఈ అలంకరణం, యీ "మేకప్" (*Make-up*) లేకపోతే, రాజువేషంలో మోజు పోతుంది. రాజు తేజో విరాజితుడు కావాలంటే ముఖానికి ఫేసుపవుడరు అద్దుతూ ఉండాలి. "మాదిరి సేయ వచ్చు జనవాధు మొగంబును చంద్రబింబమున్" అని వికవియైనా తెల్లని వర్ణము పూసినట్లుగా వర్ణిస్తూ ఉండాలి. ఆ రాజుగారికి శౌర్యం ఉన్నా లేకపోయినా, ఆయన సమరసింహుడు అని కీర్తించాలి, ఆయనలో ఏ గొప్ప గుణాలూ లేకపోతే, ఆయనలో ఉన్న మహత్తు ఎవరికీ అర్థం కాదన్నట్లుగా, ఆయన లేస్తే మనిషి కాదన్నట్లుగా, గుట్టుగా, గట్టిగా, కొట్టకుండా తిట్టకుండా,

"అతని కతండె సాటి
చతురబ్ధి పరీత మహీతలంబునన్."

అని వ్రాస్తే చాలు. ప్రభువు ప్రశస్తి కోసం ఆ కవి జబర్దస్తీగా కుస్తీకి వచ్చి తొడలు కొట్టినట్టుగా ఉంటుంది. "నాలుగు సముద్రాలచేత చుట్టబడిన యీ భూమిమీద ఆయనకు ఆయనే సాటి" అనేమాటలో ధాటీ చాలా ఉందిగాని, ఘాటు ఏమీ లేదు. "మా రాజుగారికి మా రాజుగారే

# ★ కాలక్షేపం ★

పోటీ" అని సవాలుచేస్తే కాదని వాదించే వాళ్లు ఎవ్వరూలేరు. మంచిలోగాని, చెడులోగాని ఎవరికివారే సాటి—మా రాజాగారికి సాటిరాగలవారెవరున్నారు? అని పందెంవేస్తే, ఎందులో సాటి? అని అడగాలి. కోడిపందెములలోనా? గుర్రపు పందెములలోనా? మీసాల విషయంలోనా? ఖాసాలవిషయంలోనా? మొఖాసాల విషయంలోనా? ఏమైనప్పటికీ, "గొర్రెల గోత్రాలు గొల్లల కెఱుక" అన్నట్లుగా, రాజుల గోత్రాలు కవిరాజుల కెఱుక అనే విషయం మన కావ్యాలు చదివినవారికి దివ్యంగా విశదం అవుతుంది.

రాజులు తమలో తాము వివిధంగా పోరాడి యుద్ధాలుచేసి, తమ మీసాలను సానపట్టుకుంటూ, తమ పొట్టేళ్ళతో తమ కోడిపుంజాలతో ఏకమై వివిధంగా కాలం గడిపేవారో, అదేవిధంగా కవులకూ కవులకూమధ్య, సభలలో పోటాపోటీలుకల్పించి వివాదాలు పురికొల్పి వినోదంగా విని కని ఆనందించారు. ఆ రాజుల పోషణంలో పెరిగిన కవిరాజులు కూడా ఆస్థాన ఉస్తాదుల వలెనే తయారైనారు. ఇటువంటి పరిస్థితి వల్ల కలిగిన పర్యవసానం ఏమిటయ్యా అంటే, రాజసభలో సత్కారం పొందిన కవులు ఆ రాజుగారి ముఖమును పున్నమ చంద్రునితో సాటిగా సన్నుతించారు. ఆ రాజసభలో పరాభవింపబడిన కవులు ఆ రాజుగారి ముఖమును అమావాస్య చంద్రునితో సమానమని హీనముగా గానము చేశారు. రాజుగారి సత్కారం పొందిన కవి తన కావ్యం ఆయనకు అంకితం యిచ్చి, ఆ కావ్యంలో ఆయన పేరు శాశ్వతంగా ఉండేటట్లు ఆయనను శ్లాఘించాడు. ఆ రాజుగారివద్దనే సత్కారం పొందలేక, తిరస్కారం పొంది, తన కావ్యంలో ఆ రాజుగారినే బూతులు తిట్టి, ఆరీతిగా ఆయన పేరు, ఆ కావ్యం ఉన్నంతకాలమూ, శాశ్వతంగా ఉండేటట్లు ట్రేడ్‌మార్కు రిజిస్టరు చేసినట్లుగా రిజిస్టరు చేసిన కవులు కూడా ఉన్నారు. ఇటువంటి తిట్టుకవిత్వం సాహిత్యంలో పుట్టలుగుట్టలుగా ఉంది.

పేరు శాశ్వతంగా ఉండడం కావాలి. అట్టి సందర్భంలో తిట్టుకవిత్వమయితేనేం? పొట్ట నిండుచుండ లొట్టలు వేసెడి వానివలె వ్రాసెడి లొట్టకవిత్వమయితేనేం? తిట్టుకవిత్వంలోనైనా, లొట్టకవిత్వంలోనైనా హోరుమని పేరు మ్రోగితే చాలు. మొత్తముమీద ఏదో ఒక లౌడ్ స్పీకరులో రాజుగారిపేరు దిక్కులు పిక్కటిల్లునట్లుగా మ్రోగుతూ ఉంటే చాలదా?

సినిమా తార మా ఊరు వస్తోంది అంటే జనం స్టేషనుకు వచ్చినట్లుగా, దేవుని ఉత్సవానికి ఊరేగింపుకు కూడా రారు. గంగానమ్మ జాతరకు కూడా రారు. అటువంటి సినిమా తార తన సౌందర్య ప్రభావంచేతనే జనాన్ని ఆకర్షించినదని అనుమానం లేకుండా అనలేము. ఎందుచేతనంటే, ఆమె అవయవ సౌష్ఠవం చూస్తే, "నిక్కడు, నీల్గడు, విర్రవీగడున్" అన్నట్లుగా ఉండవచ్చు. కాని, అది అంతా మేకప్పులో ఉన్న గారడీ అంటారు. తెరసానుల 'మేకప్పు'ల తెరమరుగుల మర్మమెల్ల, విప్పిచెప్పక తప్పదంటే, 'మేకప్పు' లో గల షో కప్పుచేసిన పప్పుకూడు. పెదవుల రంగుల ముదిరిన పిందెలు, ముఖముల మెరుగుల కళాయిగిన్నెలు, నేటి మన మేటితారలు. నిజంగా మన అభినయకళ యిటువంటి కృత్రిమ మార్గములలో కుటిల కులటల బాటలలో పడినందుకు భారతీదేవి కంట తడిపెట్టవచ్చు.

> "కాటుక కంటినీరు
> చనుకట్టు పయింబడ,
> నేల ఏడ్చెదో
> హాటక గర్భురాణి?"

అని మనమూ సినెమా సరస్వతిని ఓదార్చవచ్చు. కాని, ఏడ్వవలసినది సరస్వతి కాదు. లోకులకు "కనుకట్టుగా చనుకట్టు కట్టుకొని పొట్టకూటికై అందవేసిన అందకత్తెలమని, చిందులు త్రొక్కెడి చలనచిత్ర చిత్రాంగులు, తమ అందము విడ్చినట్లుగా ఉన్నదని ఏడువవలెను. అసలు ఘాటు ఆవలో ఉంది గాని, కూరలో లేదని గ్రహించలేని రసజ్ఞులం మనం. ప్రతాపరుద్రీయ నాటకములో "సారా చెంబు త్రాడు తెగిన" (సారస్యంబు త్రాడు తెగిన) చాకలి పేరిగాండ్లము మనమని గ్రహించి ఏడ్వవలసినదీ వెర్రి సినిమా తార వ్యామోహ ప్రేక్షకలోకం.

పేరుకోసం ప్రాకులాడవలసిన పని యోగులకు లేదు. భోగులకు కలదు. కీర్తికై ప్రాకులాడేవాడు రాజు. కాని బమ్మెర పోతరాజు కాదు.

పేరు శాశ్వతంగా ఉండాలంటే, భగవంతుడు కూడా పేరు పెట్టుకోవాలి. మెడలో ముత్యాలపేరు కూడా వేసుకోవాలి. కాని, నామరూపాలు లేనివాడు భగవంతుడన్నారు. మహర్షులు, మహాత్ములు ఉపాసన చేసిన దైవం అటువంటి పరబ్రహ్మమేగాని పరాయి బ్రహ్మం కాదు. మహాయోగులు ఎందరు ఏ మహారణ్యంలో ఏ మహా గుహాంతరంలో తమస్సు భేదించుటకై తపస్సుచేసి తరించిరో ఎంచి వారిని గురించి వివరించిచెప్ప విరించి తరము కాదు.

అందుకనే "ఎందరో మహానుభావులు వారందరికి వందనములు."

అని త్యాగరాజులవారు ఊరుపేరు లేని మహానుభావులు ఎందరో నమస్కరింపదగినవారు ఉన్నారని ఊహించి చెప్పియున్నారు.

బహుశః పేరు ప్రసిద్ధిలోనికి వచ్చిన మహాపురుషులకంటె, పేరు ప్రసిద్ధిలోనికి రాని మహాపురుషు లెందరో లెక్కకు మిక్కిలిగా ఉండవచ్చు. ఆకాశంలో మన కంటికి కన్పించెడి తారలకంటె మన కంటికి కన్పించని తారలెన్నో ఉన్నాయి. మనకు తెలిసిన లోకాలకంటె తెలియని లోకాలు ఎన్నో ఉన్నాయి. మన కంటికి కన్పించెడి రంగులకంటె కంటిచూపుకు అందని రంగులు ఎన్నో ఉన్నాయి. మన పంచేంద్రియములయొక్క గ్రహణశక్తికి అందనటువంటి అనేక భగవత్ చిద్విలాసములు యీ జగత్తులో ఉన్నాయి. మన జ్ఞానమునకు అందిన విషయములకంటె అందని విషయములు అనేకం ఉన్నాయి. ఇవన్నీ అనంతంగా ఉన్నాయి. ఇవన్నీ గ్రహించి కీర్తింప లేకుండా ఉన్నాము. మన సంకీర్తనకుకూడా సాధ్యం కాని విషయాలు అవి. కీర్తికి కూడా అతీతులైన మహర్షుల మహాత్ములు జగత్తులో

(49-వ పేజీ చూడండి)

# ముగ్గురు మర్త్యులు

మూలం :
## ప్రేమేంద్ర మిత్ర

అనువాదం :
## భాగవతుల రామారావు

ఏనాడో మూలపడెయ్యవలసిన స్టవ్ అదీ. దానికి గాలి కొట్టాలంటే జబ్బలు పులిసిపోతాయ్. ఎలాగో పోనీ మండిస్తే, కాసేపు పోనిచ్చి గుప్‌గుప్పు మని బారెడెత్తు మంటలు లేస్తయ్. పెద్ద చప్పుడు చేస్తుంది.

"నిజంగా స్టవ్ ఇంత రభస పెడుతోందా?" ఈ ప్రశ్న లీలగా వాసంతి బుర్రలో మెదుల్తుండే సమయంలో, భర్త శశిభూషణుడు గుమ్మంవద్ద నిలుచుండి "ఇంకా 'చా' కాలేదూ? నీ టీకోసం వాళ్ళ రైలు తప్పించేస్తావ్ కాబోలు!" అనడిగేడు.

"రైలు తప్పిపోతే తప్పిపోనియ్యండి.* ఏం? వాళ్ళేం అడివిలో ఉంటం లేదుగా? ఓరాత్రికి వాళ్ళని మనం ఉంచుగోలేకపోం."

శశిభూషణుడు మరో అడుగు లోపలికి వేసి సీరియస్‌గా మొహం పెట్టి అన్నాడు! "అబ్బే. అది కాదు. నువ్వు సరిగ్గా అర్థం చేసుకోలేదు—" వాసంతి మొగుణ్ణి పూర్తిగా చెప్పనియ్యకుండా మధ్యలో ఆపింది. "నాకంచక్కా అర్థం అయింది. ఐతే మాత్రం నేనేం చెయ్యను? నాకున్నవి రెండే చేతులు, పది చేతుల్లేవు"

ఇంతవరకూ శశిభూషణుడు స్టవ్ మాట గమనించలేదు. స్టవ్ కనిపించగానే "అరె! మళ్ళీ బయటకి తీసేవ్ ఈ బొక్కి స్టవ్‌ని?" అని ఆదుర్దాగా అడిగేడు.

"లేకపోతే ఎలాగౌతుంది? ఒక్క పొయ్యిమీదే అన్నీ గమ్మున ఎలా ఐపోతాయనుకున్నారు?" తర్వాత శశిభూషణుడి మొహంలోకి చూసి నవ్వుతూ అంది. "మీ 'గెస్టు'ని ఓ కప్పు టీ నీళ్ళిచ్చి దారి పెట్టేలేంగా?"

ఈవాక్యం వెనక ఏ గూఢార్థం దాగి ఉందో ఎవరికి తెలుసు?

శశిభూషణుడి దృష్టి మాత్రం ఇంకా స్టవ్ మీదే ఉంది. "ఇంతకీ నువ్వీ బొక్కి స్టవ్‌ని ముట్టించకపోతే బాగుణ్ను" అన్నాడు.

[* బెంగాలీస్త్రీలు భర్తల్ని 'నువ్వు' అని ఏకవచనంతోనే పిలుస్తారు. కాని తెలుగువారికది వెగటుగా ఉంటుందని ఈకథలో అంతటా ఆయా సందర్భాల్లో బహువచనమే వాడబడింది.]

"సర్లెండి. మీకేం బెంగెట్టుకో అక్ఖర్లేదు. మీరు పన్లేమీ వేగిరం ఐపోవాలి. మళ్ళీ నే స్టవ్ వెలిగించేనని రాద్ధాంతం చేస్తారు. ఇహ వెళ్ళి, మీ అతిథితో కాసేపు కబుర్లాడుతుండండి. మీ వెనకాలే టీ పట్టుకొస్తున్నాను."

"కాని ఈలోపున నేనే లోపలికి రాకుండా ఉండలేకపోయాను. ఔనుగాని 'బౌదీ'! ఎందుకు చెప్పండీ ఈ తతంగం అంతానూ?"—మల్లిక గుమ్మంవద్ద నిలుచుంది. బహుశా కాళ్ళకి జోళ్ళున్నాయని కాబోలు లోపలికి రాలేదు.

మల్లిక పరిచయం అప్పటికే అయింది. కాని 'ఒదినా' అని పిలవబట్టం చాలా కొత్తగా ఉంటంచేత వాసంతినుంచి జవాబు రావటానికి కాస్త టైము పట్టింది. తర్వాత మల్లిక వేపు చూసి అంది: "అబ్బే! ఏం మహా చేస్తున్నాననీ? ఏమీ చెయ్యలేకపోయేననే విచారంగా ఉంది."

మల్లిక జోళ్ళు విప్పి, వట్టింటి లోపలికొచ్చి వాసంతి పక్కనే చతికిలబడింది. "అయ్యో! కటిక నేలని కూచోడమేం ఖర్మం?" అంటూ వాసంతి గోడవారనున్న చాపని మల్లిక ముందుకి తోసింది.

మల్లిక చాపని పక్కకి నెట్టేసి "ఉండనివ్వరూ. నేలని కూచున్నంత మాత్రాన నా గౌరవానికేం భంగం రాదు. ఐనా చూస్తున్నాను కాదూ, అంత తు.చా. తప్పకుండా సత్కారం చెయ్యాల్టండీ నాకు? వెదికి వెదికి మీ ఇంటికి నా అంతట నేనే రాకపోయుంటే అనుకోవచ్చు" అంది.

వాసంతి మొగుడివేపు దృష్టి సారించి, "అలా నన్నడిగితే నేనేం జెప్పను?" అంది.

చాలసేపాయి గాలి కొట్టడంచేత స్టవ్ తిన్నగా మండుతోంది. టీకెటిల్ స్టవ్ మీదెక్కించి "వంటింట్లో కొంచెం పనుంది. కూచుని మాటాడుతుండండి. ఇప్పుడే వస్తా" అంటూ వంటింట్లోకి వెళ్ళింది వాసంతి.

మల్లిక ముడ్రోంచుకుని కూచుంది. శశిభూషణుడు ఏం చెయ్యటానికీ తోచక దిక్కులు చూస్తూ నిలుచున్నాడు. హద్దు మీరిన హడావిడి చేస్తోంది స్టవ్. [illegible]లు చిల్లులుపడేలా ఊరంత చప్పుడు చేస్తూ చిరాకెత్తిస్తోంది.

ముడ్రదించుకుని కూచున్న మల్లిక ఉన్నట్లుండి "ఈవిధంగా నే నిక్కడ కలగజేసుకోవడంలో బహుశా చాలా తెలివితక్కువ పని చేసుంటాను" అంది బిగబట్టిన గొంతుకతో.

మల్లిక ఈ మాటల్ని ఇంకా మెల్లిగా అందామనుకుంది. కాని స్టవ్ చేసే గోలచేత గట్టిగా అనక తప్పింది కాదు. గొంతెత్తి అనడంచేత ఆమె మాటల్లో హుందాతనం పోయి, చప్పగా అనిపించినయ్.

"నోనో! ఏమిటి హానినీ?" అస్తవ్యస్తంగా జవాబిచ్చేడు శశిభూషణుడు. కాని మల్లిక ఆవిధంగా సమాధానం ఒస్తుందనుకోలేదు. ఈమాటు కళ్ళెత్తి శశిభూషణుడి వేపు చూసి అంది: "ఇన్నాళ్ళ తర్వాత ఇవాళే ఈ అభిలాష ఎందుకు కలిగిందో నామట్టుకు నాకే తెలీదు. ఈ ఊరుమీదుగా ఇంతకుముందు రెండు మూడు సార్లు ప్రయాణం చేసేను. రైలు మారటానికి స్టేషన్లో నాలుగైదు గంటలసేపు కూచునే దాన్ని. ప్రతిమాటూ నాకు తెలుసు నువ్వీ వూళ్ళో ఉన్నావని. ఐనా మీ ఇంటికి రావాలని అభిలాష ఎప్పుడూ కలగలేదు."

శశిభూషణుడు జవాబివ్వలేదు.

స్టవ్ ఒక్కమారు గుప్పుమని మండి మంట తగ్గిపోసాగింది. మల్లిక ముందుకు జరిగి స్టవ్‌కి గాలికొట్టడం మొదలెట్టింది. మళ్ళీ మంటలేచి గదంతా దాని గోలతో నిండిపోయింది.

శశిభూషణుడు తుళుక్కుపడ్డట్టు "ఏమిటి చేస్తునావ్? అంత ఎక్కువగా పంపు చెయ్యకు" అన్నాడు ఊరంత గాభరా పడుతూ.

మల్లిక గాలికొట్టడం ఆపేసి, ఆశ్చర్యపడుతూ అడిగింది శశిభూషణుణ్ని: "ఏంచేత?"

"స్టవ్ చాలా పాతది. ఠపీమని 'బరస్టు' ఐపోవచ్చు"

"ఇదో లేనిపోని రభస, అంతేకదూ?"—శశిభూషణుడి మీదే దృష్టి నిశ్చలంగా నిలిపి అంది. శశిభూషణుడు చూపు కష్టంగా మరోవేపు తిప్పుకున్నాడు. కాని మల్లిక చూపు చెదర్చకుండా అడుగుతోంది: "మరి నీ పెళ్ళాం స్టవ్‌ని వాడుతోందే?"

ఎటో చూస్తూనే జవాబిచ్చేడు శశిభూషణుడు: "లేదు. పాడయిపోవడంచేత దీన్ని చాలకాలమాయి వాడ్డంలేదు. ఇవాళ దీన్నెందుకు బయిటికి తీసిందో మరి?"



తాళిబర్హము

"అదా సంగతి" అనేసి బుర్రొంచుకు కూచుంది. ఒక్కమారు తృప్తిపడ్డ వాడిలాగ శశిభూషణుడు అడిగేడు: "మళ్ళీ ఏంపిటి చేస్తున్నావ్? పంప్ చెయ్యొద్దని చెబుతుంటే. ప్రమాదం సుమా!"

స్టవ్ గోలమూలంగా శశిభూషణుడు కాస్త గట్టిగానే చెప్పవలిసొచ్చింది. అదే సమయానికి వాసంతి వంటింట్లోంచి తినుబండారాల ప్లేట్లు పట్టుకొచ్చి గుమ్మం ముందు నిలుచుండిపోయింది. నవ్వుతూ అడిగింది: "మళ్ళీ ఏమిటి గొడవ?"

వాసంతివేపు తిరిగి నవ్వుతునే జవాబిచ్చింది మల్లిక: 'చూడండొదినా! స్టవ్ కి ఓ కొంచం ఎక్కువగా గాలికొడితే ప్రమాదంట. నిజంగా మీ స్టవ్ అంత చెడిపోయిందా?"

వాసంతి లోపలికొస్తూ మొగుడి వేపోరగా చూసి. "ఏం చెడిపోలేదు. ఆయన బడగానే ఇహ స్టవ్ పనికిరానట్టే" అంది.

"నా ఉద్దేశం అదేనా." మరాలోచించకుండా మల్లిక గాలికొడుతోంది. కెటిల్ కింద నీలిరంగు మంటలు చుట్టూ లేచినయ్.

శశిభూషణుడు ఏదో అనబోయేడు కాని అనలేకపోయేడు. ఆందోళననీ, అసహాయతనీ వ్యక్తపరుస్తూ వాసంతివేపు చూసేడు. వాసంతి కిక్కురుమనకుండా అలానే నిలుచుంది.

శశిభూషణుడు వెంటనే బయటికి వెళ్ళిపోయేడు, వీధి గదివేపు. వాసంతి నవ్వుకుంటూ మల్లిక పక్కని కూచుని స్టవ్ ని ముందుకు లాక్కుంది. "దాన్ని నాకు వదిలిపెట్టండి. మీ కెందుకీ శ్రమ? ఓ కాసేపు సరదాగా ఉండిపోదామని మీరు మా ఇంటికి రావడమేమిటి, మేం మీ చేతే చాకిరీ చేయించుకోవడమేమిటి? ఎంత అమర్యాద! క్షమించి వెళ్ళి, వీధిగదిలో

న్నాను. అవతల మీ అన్నగారుకూడా ఒక్కరూ కూచోలేక విసిగెత్తిపోతుంటారు"

వాసంతి అన్న ఈ మాటలన్నీ బహుశా మల్లిక వినిఉండదు. ఒక్కమారుగా ఆమె ఎంతో మథనపడుతూ అంది: "మీరు భయపడుంటారు - నేను మీ స్టవ్ ని పగలగొట్టేస్తానేమో నని"

"అయ్యో! ఎంతమాట? నా కెందుకూ భయం? స్టవ్ చెడిపోయేదుంటే ఏనాడో చెడిపోయేది" తర్వాత వాసంతి గొంతుకు మార్చి అంది: "ఇంక మీరు లేచి వెళ్ళి వీధిగదిలో కూచోక తప్పదు. ఇప్పటికే చెయ్యవలసిన మర్యాదల్లో చాలా లోటుపాట్లు జరిగిపోయేయ్."

"లోటుపాట్లు కూడానా! యథావిధిగా చెయ్యాల్సిన మర్యాదలు చేసేస్తూ? మంచి వారే!" అంటూ మల్లిక లేచి వీధి గదివేపు వెళ్ళిపోయింది. అక్కడికూడా స్టవ్ గోల స్పష్టంగా వినిపిస్తోంది. ఐతే అంత భరించరానంతగా లేదు. శశిభూషణుడు మల్లిక



# సందె మజిలి

ఫొటోలు: కొంపల్లి సుబ్రహ్మణ్యం; గుంటూరు.

మల్లిక దగ్గరకొచ్చి నిలుచున్నాక మీదికి చూసి తెల్లబోయేడు. వెలవెలబోతూనే "మీ అన్నయ్య అలా తిరిగొస్తానని బయటికెళ్లేడు. ట్రైనుకి టైమైపోయిందని చెప్పినా విన్నాడు కాదు" అన్నాడు.

"వెళ్లనీ. నువ్వేం ఇదవకు. మేం మాత్రం రైలు తప్పోం" వివిధమైన అక్కస్సూ లేకుండా మామూలుగానే అంది మల్లిక. కాని కుతూహలమైన కళ్లతో శశిభూషణుడి వేపు చూడకుండా ఉండలేకపోయింది. ఈ మాటలకేనా జవాబుగా శశిభూషణుడేదేనా చెప్పకూడదూ?

కాని శశిభూషణుడు కిక్కురుమనకుండా వేరేదిక్కు చూస్తున్నాడు. మల్లిక్కి గట్టిగా అరవాలనిపించింది "నువ్వేం బెంగెట్టుకో అక్కర్లేదు. నీకేం భయంలేదు. ఏ వేళ తర్వాత హఠాత్తుగా ఇవాళ నీకుటుంబంలో మనస్పర్థలు లేవదియ్యటానికి నే రాలేదిక్కడికి. కానీ అగ్నిహోత్రం ఏనాడో ఆరిపోయినప్పటికీ ఒకటో రెండో కాంతి రేఖలు ఇప్పటికీ మినుకు మినుకు మనక పోవు - అనుకున్నాను సిగ్గుమాలిందాన్ని."

ఐతే నిజానికి దీంట్లో ఒక్క మాటకూడా అన్లేదు. అతి సరళమైన ధోరణిలో మామూలు సంభాషణ సాగిపోనివ్వడానికి ప్రయత్నించింది: "నువ్విక్కడ నాలుగేళ్లాయి ఉద్యోగం చేస్తున్నావ్ కదూ?"

"ఔను ఇంచుమించుగా ఔతుంది."

"ఇంతంటి మారుమూల పట్నంలో ఉండిపోవటం నీకు నిజంగా నచ్చిందా?"

"ఒకవేళ నచ్చకపోతే మాత్రం నేచెయ్యగలిగేదేముంది? కలకత్తా కాలేజీల్లో ఎక్కడా ఉద్యోగం దొరకటం కష్టం."

నే చెయ్యగలిగేదేముంది? - అదే శశిభూషణుడి నుంచి దొరికే జవాబు. శశిభూషణుడి నిజస్వరూపమే ఇంత. విధి చేతుల్లో ఎప్పుడూ ముందుగానే ఓటమిని అంగీకరిస్తాడు. ఒక్కమారేనా ప్రవాహానికి ఎదురు నిలబడ్డానికి అతనికి సాహసం లేకపోయింది. అదంతా ఇలాగే [illegible] చేతకాక పరిస్థితులకి లొంగిపోయేడు. ఆ సమయంలో అతడు కాస్త గుండెనిబ్బరం కలిగుంటే అది వాళ్ళ జీవితకథని బహుశా మరోలా మార్చుండేది

## 2

ఆరోజు ఇప్పటికీ ఆమెకు బాగా జ్ఞాపకం. ఇద్దరూ సంప్రదించుకుని మ్యూజియంలో ఓ గదిలో కలుసుకుందికి ఏర్పాటు చేసుకున్నారు. కాలేజీలో రోజూ ఒకర్నొకరు చూస్తున్నారు కాని మాటాడుకోవటం పొసిగేదికాదు. అందుచేత ఎప్పుడేనా సమయం, అవకాశం కలిస్తే ఒకరికోసం ఒకరు ఈ గదిలో వేచుండేవారు. మ్యూజియంవాళ్లు శిలాఖండాల్ని సేకరించుకుందికి నిర్దేశించిన గది అది. ఆ గది వాళ్ళ జీవితంలో ఎన్నో ఉద్రిక్త సంఘటనలకూడా సాక్షి.

ఆరోజున మల్లిక చాలాసేపు వేచిఉండ [illegible]

# ★ ముగ్గురు మర్త్యులు ★

ఆలస్యంగా వచ్చేడు శశిభూషణుడు. అతని మొహంలోకి చూసీ చూడగానే మల్లికకి అంతా అర్థం ఐపోయింది. అయినా నిరుత్సాహాన్ని కనబరచకుండా ఉండటానికి ప్రయత్నించింది మల్లిక.

కొంతసేపటిదాకా ఏ 'ఒక్కరూ మాట్లాడలేదు. కాసేపు చుట్టూరా పచారు చేశాక మల్లిక మరి నిలదొక్కుకోలేకపోయింది. సందేహాన్నంతా విడిచిపెట్టి తనే అడిగింది: "ఆవిడ ఏమన్నారు?" అని.

"మా అమ్మ?" – శశిభూషణుడు కొద్దిగా తృళ్లిపడ్డాడు. కాసేపూరుకుని, మరోవేపు మొహం తిప్పుకొని "నేనింకా మా అమ్మకేమీ చెప్పలేదు." అన్నాడు.

మల్లిక నిర్ఘాంతపోయింది. బొంగురుపోయిన దుర్బల స్వరంతో శశిభూషణుడే మిగతాది చెప్పేడు: "మా అమ్మ ఆరోగ్యం ఏమీ బాగోలేదు. గాలిమార్పుకని ఇవాళ శివ్‌పూర్ వెడుతోంది."

మల్లిక అలాగ ఎంతోసేపు – ఓ జీవితకాలం – నిశ్శబ్దంగా ఉండిపోయింది. తర్వాత మెల్లిగా గొణిగింది: "నువ్వో? – నువ్వుకూడా వెడుతున్నావా?"

కొంచం జంకుతూ జవాబిచ్చేడు శశిభూషణుడు: "మా అమ్మ నన్నూ రమ్మంటోంది. పైగా—పైగా ఆవిడతో చెప్పవలసిందేదో అక్కడే చెప్పడానికి అనువుగా ఉంటుందని నా అభిప్రాయం."

మల్లిక మరి మాటాడలేదు. తను ప్రశ్నలు వెయ్యాల్సిన అగత్యం దాటిపోయిందని అనుకుని ఉంటుంది.

కాసేపు పోయాక శశిభూషణుడే అన్నాడు: "మా ఇంట్లో ప్రతిఒక్కరికీ— ఆఖరికి మా అమ్మక్కూడా— నే చెప్పకుండానే తెలుసు."

అతడన్నదానికి ఏమంటానికీ మల్లికకి ఆసక్తి లేకపోయింది.

ఈమాటు క్షమాపణ చెప్పుకునేటట్టు చెప్పుకుపోయేడు శశిభూషణుడు; "అసలే అనారోగ్యంగా ఉన్న మా అమ్మ మరీ ఆందోళనపడుతుందన్న బెంగచేత ఏ విషయం ఆవిడతో నేనింకా చెప్పలేదు. అయినా కొసకి ఆవిణ్ని ఎలాగైనా సరే ఒప్పించి తీరుతానని నాకు నమ్మకం ఉంది"

మొహం మీదగొట్టేలాంటి జవాబు మల్లిక గుండెల్లోంచి గొంతుకదాకా వచ్చింది. 'మీ అమ్మగార్ని ఒప్పించటం ఒక్కటే ముఖ్యాతిముఖ్యమా? నాకూ అమ్మా నాన్నా, స్నేహితులూ, బంధువులూ లేరూ? నా జీవితం అంతా కేవలం మీ అమ్మగారి దయ సంపాదించటంమీదే ఆధారపడుతుందన్నమాట?'

కాని ఈమారుకూడా మల్లిక తన్ను తాను తమాయించుకుంది. బహుశా ఆమె జీవితంలో చేసిన గొప్ప పొరపాటుకూడా అదేనేమో! తన మనసు తెలుసుకోటానికి తనకే సాహసం చాలని రకం మనిషి శశిభూషణుడు. అలాంటి మనిషిని లోబరుచుకోవాలంటే కాస్త గట్టిగా తగిలిస్తుండాలి – ఒత్తిడిచేసి, బలిమిని దగ్గరికి లాక్కోవాలి. ఆమె తన ముగ్ధత్వం ఒదిలిపెట్టి, శశిభూషణుడి జడత్వాన్ని ఆనాడు తునియలు తునియలుగా త్రెంచిపారేసుంటే ఏవిఁటి హాని జరుగుండేదని? తను ప్రయత్నించుంటే శశిభూషణుడు వెనుదియ్యటం నుంచి ఆపగలిగేదని ఆమెకు తెలుసు. శశిభూషణుడికి ఉలుకూ, ఉద్రేకమూ శూన్యం. కాని తను తలుచుకుంటే అన్ని సందేహాల్ని, అన్ని అడ్డంకుల్ని నిలవదొక్కుకునే మనోబలం అతన్లో ఉద్దీపితం చెయ్యగలిగేది. కాని స్త్రీలకుండే సహజమైన ముగ్ధత్వంచేతా; మోమోటమీ, బిడియం చేతా—బహుశా గాయపడిన ఆత్మగౌరవం చేతా—ఆమె అందుకు ప్రయత్నించలేదు. ఎంత పొరపాటు చేసింది!

కాని నిజంగా అది పొరపాటేనా? – హఠాత్తుగా ఈ ప్రశ్న మెరుపులా మెరిసి ఆమె మనోసీమలో కొత్త వెలుగు వెలిగించింది. తనమీద తనకి నమ్మకంలేని, చేతకాని ఈ దుర్బలుడికోసం ఈ విదేళ్ళాయి ప్రతిక్షణం నిశ్శబ్దంగా తన్ని తాను దగ్ధం చేసుకుంటోంది. కాని ఒకవేళ తనీ మనిషిని గెలుచుకుని వుంటే నిజంగా ఆనందంగా ఉండగలిగేదా? ఈ జడపదార్థాన్ని జీవితాంతమూ రెచ్చగొడుతుండటం – ఏదో రోజున భరించరానిది కాకపోతుందా?

"స్టవ్ చప్పుడు చాలా దుర్భరంగా ఉందికదూ?" శశిభూషణుడన్న ఈమాటలు మల్లికని స్వాప్నికావస్థనుంచి తెప్పరిల్లించేయి.

వింతగా నవ్వుతూ అంది: "నీకు భయంగా ఉందా? కాని 'బాదీ' స్టవ్ చెడిపోలేదంటోందే?"

## 3

కెటిల్‌లో నీళ్లు కళపెళా మరిగి స్టవ్ మీద పొంగిపోతున్నాక కాని వాసంతి అటువేపు లక్ష్యం ఉంచలేదు. కెటిల్ కిందికిదించి, టీపాట్‌లో వేణ్ణీళ్లు పోసేసి, స్టవ్‌ని ఆర్పెయ్యటానికి 'కీ' మీదికి చెయ్యి చాచింది. కాని అకస్మాత్తుగా ఆమె కేదో జ్ఞాపకం రావటంచేత స్టవ్ మర తిప్పి లేకపోయింది.

ఈ రోజునే, ఇప్పుడే ఠపీమని స్టవ్ నిజంగా 'బర్స్టు' ఐపోగల్దా?

ఇంతకీ విధితో ఈ చెలగాటం ఆడే గుండెనిబ్బరం తనకుందా? ఇవాళ ఇది ఉప్పన్నపు బుడిలా కనిపించినా ఒకానొక

ప్పుడు ఇలాంటి దారుణమైన ఉద్దేశం కలగటానికి కారణం ఈ మల్లికేనూ. తను మల్లికనెప్పుడూ చూసుండలేదు. కనీసం మల్లిక ఫొటో యేనా చూళ్ళేదు. కాని తన శ్రేయోభిలాషుల ధర్మమా అని ఆ మూడక్షరాల పేరుమాత్రం తనీయింటో అడుగుపెట్టిన తొలిరోజు నుంచీ తన దివారాత్రాల్ని విషపూరితం చేసింది. మల్లిక రూపాన్ని తను ఎలా చిత్రించుకునేది!

కాని తన ఊహాచిత్రానికీ, తన కళ్లముందివాళ కనిపిస్తున్న మల్లికకీ మధ్య ఇంత అంతరం ఉంటుందని తనెన్నడూ అనుకోలేదు. మల్లిక కురూపి అందానికి వీల్లేదు. అలాగని మగాడి మనసుని చిరకాలమూ జాజ్వల్యమానం చేసేంత అందగత్తె కాదు. నేటికాలపు చదువుకున్న అమ్మాయికి తగ్గట్టుగా నాజూగ్గా మాత్రం ఉంది. ఐతే పైబడిన వయస్సు మాత్రం దాపుడు కాలేకపోయింది. ఆమె కాలేజీలో తన మొగుడికి సహాధ్యాయి. అంచేత ఆమె బాగా వయసు మీరిందే అయుండొచ్చు.

మొగుడి నోటంట తనెప్పుడూ మల్లిక పేరు వినలేదు. కాని హెచ్చరించడానికి సలహాలియ్యడానికి తనకెంతోమంది శ్రేయోభిలాషుల్లేకపోలేదు.

కార్యం గదిలో ప్రవేశించడానికి తను చక్కగా అలంకరింపబడిన శోభనంనాటి రాత్రే వరసకి తనకి అమ్మమ్మ అయే నడివయస్సామె ఒకర్తె చుట్టూవున్న ఆడవాళ్లతో "మీరంతా అమ్మాయిని అంచక్కా అలంకరించేరే కాని ఎవరేనా దానికో ఇనప గొలుసిచ్చేరా? లేకపోతే అమ్మాయి ఆ 'ఎగిరే పిట్ట'ని ఎలా పట్టిబంధించ గలుగుతుందీ?" అని మొరటుహాస్యం ఆడింది.

మొదట ఏమీ అర్థం కాకపోవడంచేత ఆ పరిహాసానికి తను తెల్లబోయింది. ఇంతకీ ఏదో అనందీ సరదాతీరని మనుషులు ఆ అనేదేదో అర్థమయేలా ఎంచేత అనరో? మొత్తానికి కొద్దికొద్దిగా అంతా వింది.

తన మొగుడి నోటంటే ఒకటి, రెండు సార్లు మల్లిక పేరు వినుంటే తను అంతగా నొచ్చుగోకపోయేది—మొగుడి మూకీభావం మరీ రంపపుకోతలా వుంది. చాలా పర్యాయాలు మొగుడు పక్కమీద పడుక్కుని మౌనముద్రాంకితుడై ఉండటం చూసింది. ఆమె హృదయంలో ఆందోళన పుట్టుకొచ్చేది. బహుశా—బహుశా ఏమిటి?—కచ్చితంగా తన మొగుడు ఆ సమయంలో మల్లిక గురించే ఆలోచిస్తున్నాడు.

'మల్లికే రాత్రింబవళ్ళు మీ ఆరాధ్యదేవత ఐతే నన్నెందుకు పెళ్ళిచేసుకున్నారు?' - ఇలాగ అసభ్యంగా మొగుడితో జట్టీ పెట్టుకున్నా కొంతమట్టుకు ఆమె హృదయంలోని బాధ బహుశా నివారింపయేదేమో. కాని బదులుగా పక్క విడిచి బయిటికి వెళ్లిపోయేది.

తలుపు తీసిన చప్పుడు వినగానే శశిభూషణుడు తెల్లబోయి "ఎక్కడికి వెడుతున్నావ్?" అని అడిగేవాడు.

"బయటికి వరండామీదికి." అదే దాని కంతం — అంతకుమించి చెప్పవలిసిన అగత్యం లేకపోయేది. తనెందుకు బయటికి వెళ్ళిపోయిందో మొగుడేనాడూ అడిగిన పాపాన పోలేదు. అతని కసలా కుతూహలమే లేదు. తను తరుచు అనుకునేది- మాటవరసకి 'గంగలో దుముకుదామని వెడుతున్నాను' అని చెప్పినా అప్పుడుకూడా తన మొగుడు 'అలాగా' అనేసి నిశ్చింతగా మౌనముద్రలో ఊగులాడేవాడేమో. ఉల్లాసంలేని ఈ వ్యతిరేకత, చలనంలేని ఈ జడత్వం ఆమెకు సహింపరానిదిగా ఉంది - శూలాల్లా పొడిచే ఎత్తిపొడుపు మాటలూ, అవమానాలే ఇంతకంటే ఎంతో మెరుగు.

ఏదేనా జరిగుంటే మాత్రం ఏమిటి పోనిసీ?—అని ఈ స్టవ్ ముందు కూచుని ఒకానొకప్పుడు అనుకుంది. అప్పటికి తన అత్తగారు బతికున్నారు. "ఆస్టవ్ నెందుకు వెలిగించేవ్ 'బామా'(కోడలా)? అది పాడయిపోయిందనే నేనెవర్నీ దాన్ని ముట్టుకోనివ్వట్లేదు. జాగ్రత సుమీ, అమ్మాయ్. అది కాని పేలిపోయిందంటే చాలా ప్రమాదం" అని తను టీ చెయ్యడానికి స్టవ్ ముట్టించడం చూసి హెచ్చరించేదావిడ.

చాలా ప్రమాదంట! నిజానికి ఇలాంటి ప్రమాదాలేం కొత్త కావు. తన బలాన్నంతా కూడగట్టుకుని పంపుచేసినా ఏ ప్రమాదమూ జరగలేదు.

ఎప్పట్నుంచీ ఇదంతా క్రమంగా మరుగున పడిందో వాసంతి కిప్పుడు సరిగ్గా జ్ఞప్తి లేదు. కాని తాపీగా ఇది మాత్రం తెలిసింది: ఈ మనిషి - తన చేయూతలేందే అడుగుతీసి అడుగుపెట్టలేని, ఎందుకూ చేతకాని ఈమనిషి; అతనికి జ్వరంవచ్చిన సంగతికూడా తను చెబితేకాని తెలుసుకోలేని ఈమనిషి - హృదయంలో అట్టడుగున అమరమైన అనురాగం ఉందని నమ్మకుండా వుండగల్దా? పారదర్శకమైన నీటికంటె సుస్పష్టంగా అతని హృదయాన్ని అవగతం చేసుకోగల వాసంతికే తెలీకుండా అంత మహత్తరమైన అనురాగాన్ని మౌనముద్రాంకితుడైన ఈ మనిషి రహస్యంగా దాచుకోగలిగే మరుగు ప్రదేశం ఎక్కడేనా వుందా?...ఒకవేళ ఎప్పుడేనా శశిభూషణుడి హృదయాన్ని అంతర్గత స్మృతులేవేనా కలవరపరిచినా అవి ఏనాడో పూర్తిగా తుడుచుకుపోయుంటాయ్. ఇది మట్టుకు మాత్రం వాసంతికి కచ్చితంగా తెలుసు.

అంచేతనే ఒకమారు తనే మొగుడితో మల్లిక విషయం కదిపింది: "అన్నట్టు, గోకుల్‌పూర్ గర్ల్సుస్కూలుకి కొత్తగా వచ్చిన హెడ్ మిస్ట్రెస్ ఎవరో మీకు తెలుసునండీ? మీ మల్లికాకాయేనూ."

మొగుడూ పెళ్ళాలమధ్య మల్లికగురించి ఇదే మొదటి ప్రసంగం. అయినప్పటికీ ఆమె మాటలూ, ఆమె అడిగిన విధం కూ

(56- వ పేజీ చూడండి)

మోహ: తను ఉపకృతి మరువలేను.

కనక: మరి సెలవు.

*    *    *

[ప్రతాపసింహ మహారాజు కొలువులో భైరవితాళం]

ప్రతాప: ఇంత మనోహరంగా ఉన్న యీ తానవర్ణం వాచా వినవలెనని కుతూహల పడుచున్నాము.

ఆది: ప్రభువువారి చిత్తం. ["విరిబోణీ. నిన్నె కోరి మరులుకొన్నది. సరసుడౌ దక్షిణ ద్వారకస్వామి రాజగోపాలదేవా నిగుణా". పాడును]

ప్రతాప: భైరవి రాగంలో కూడా ఇంత భావలాలిత్యం తీసుకొనివచ్చినందుకు పరమానందముగా ఉన్నది.

ఆది: అనుభవసిద్ధమైనది రసౌచితి.

ప్రతాప: అనుభవం అంటున్నారు. విరిబోణి ఎక్కడైనా ఉందా......

ఆది: వాగ్గేయకారకుల హృదయక్షేత్రాలకి సాక్షాత్కారం ఉంటుందిగా.

ప్రతాప: ఆదియప్పయ్యగారు అందరి వాగ్గేయకారులవంటివారు కారు. అనుభవసిద్ధం కానిది వచింపరు. ఎవ్వరీ విరిబోణి?...

ఆది: ప్రభువువారి సెలవైనచో తమ సమ్ముఖానే ఇప్పుడే సలాములు చెప్పగలదు.

ప్రతాప: ఈ విరిబోణి మన ఆస్థానపు పరిజనములోనిదేనా?.........

ఆది: ఆస్థానము నలంకరింప నభిలషించే ఒక నర్తకి. నాడు రాజగోపాలస్వామి ఆలయానికి దక్షిణద్వారమువద్ద నిలిచియున్న సుందరి.

ప్రతాప: అవును. నాడే చిరునవ్వుతో కన్నులు పెద్దవిచేసిన యీ సొగసులాడి ఉత్సవమునాడు సేవించిన పురంధ్రి అనుకొన్నాను.

ఆది: అప్పుడే నాట్యము పూర్తిచేసి దేవర వీక్షింపనెంచిన ద్వారముకడ నిలిచియున్నదట.

ప్రతాప: ఏదీ యీ విరిబోణి......

ఆది: కనకాంగీ......ప్రభువువారి సెలవైనది. ఏదీ నీ నాట్య ప్రదర్శనం.

[నాట్యం]

ప్రతాప: ఈ నర్తకి నాట్యవిన్యాసాలతో కూడ పూవుబోణిలాగ ఆడుచున్నదే.

ఆది: అందుకే - నే నిచ్చిన నామం అన్వర్థమైనది.

ప్రతాప: ఈ సుందరిని ఆస్థాన నర్తకిగా చేర్పించుడు.

కనక: వలదు మహారాజా. వలదు. ఈ దాసిని నర్తకిగా - గాయనిగా బ్రతుకనీయండి.

ప్రతాప: మహారాజ ప్రేమపాత్రమైన ఒక మానిని మరియొకరికుండు నర్తకిగా - గాయనిగా...

కనక: క్షమించవలెను ప్రభో ... నృత్యగానాలు - జీవప్రాణాలుగా జీవించే మాబోంట్లకు - రాజానుగ్రహం...

ప్రతాప: ఇది రాజాజ్ఞ. కనకాంగి - విరిబోణిగా మా యంతఃపురి నలంకరించవలసిందే...

కనక: ఈ దాసురాలు - ఒక వారం దినములు గడువు కోరుచున్నది.

ప్రతాప: అట్లే కానీయవచ్చును.

[ఆదియప్పయ్యగారి యింటి - రాత్రి వేళ తలుపుచప్పుడు]

ఆది: ఎవరది?...

కనక: .........

ఆది: స్త్రీకంఠస్వరంలాగున్నదే. ఈ యర్ధరాత్రి వేళ - ఎవరది పిలుచుచున్నది.

కనక: గురువర్యా...

ఆది: విరిబోణీ - ఈ రాత్రివేళ......

కనక: ఒక విషమసమస్యలో మీ సలహా కోరివచ్చాను.

ఆది: కనకాంగీ ఏమా విషమసమస్య...

కనక: మిమ్ములను ఆనాడు అన్నివిధాల బ్రతిమాలకపోయినా యింతవరకూ రాకపోయేదమో...

ఆది: ఇప్పుడేమయింది?

కనక: మాయమ్మ - మిమ్ములను చూచేవరకూ తోచనీయలేదు. చూచాను. నా యందలి ప్రేమచే మీరు మహారాజావారికి విన్నవించారు.

ఆది: నీపైన ఒక వర్ణం వ్రాశాను.

కనక: విన్నాను స్వామీ విన్నాను. అది వినగానే నాయందలి మీ యనురాగం ఎంత అమూల్యమో అవగాహన జేసుకున్నాను.

ఆది: ఆ వర్ణం వినే మహారాజా నిన్ను చూడకోరారు. నీ నృత్యం చూచి ఆనందించలేదా?

కనక: ఆనందించి - నన్ను అంతఃపురానికి ఆహ్వానించారు.

ఆది: ఇంకనే నీ జన్మ సార్థకమైనది. నర్తకిగా జీవించే - నారీమణివి రాణీవాసం అలంకరిస్తావు. సమస్త భాగ్యాలూ అనుభవిస్తావు.

కనక: స్వామీ. ఇటు చూడండి. నాకొ రాణీవాసం వద్దు. నిష్కల్మష హృదయుని ఒక మహామేధావి - అనురాగ భాగ్యం పొందాను. చాలు. విచ్చలవిడిగా తిరిగే విహంగాన్ని పంజరంలో బంధిస్తారా?

ఆది: అయితే ఇప్పుడు నీకోరిక?

కనక. ఈ చెర తప్పింపమని......

ఆది: రాజాజ్ఞకి ప్రతీకారమా?

కనక: ప్రతీకారమే...

ఆది: ప్రతీకారం చేసి...

కనక: మీయండ జీవిస్తాను.

ఆది: రాచపగ పాముపగ.

కనక: అంతేనా... నాకోసం మీరీ పదవిని విడువజాలరా?

ఆది: నేను పదవి నెక్కువగా ఆశింపను గాని - ఆయన నిమిత్తం... నాకోసం నీవు రాణివి కావలసిందే.

కనక: ఇదేనా మీ కడసారి హితవు.

ఆది: ఇదే.

కనక: నా సంగీతం - నా నాట్యం...

ఆది: అవెక్కడికి పోతాయ్?

కనక: మీ యనురాగాన్ని... మీ అంతరంగాన్ని మరచిపోవలసినదేనా ... మీ యవ్యాజప్రేమ......

ఆది: అది మబ్బుతెరవంటిది. నీకూ నాకూ మధ్య ఎన్ని అంతరాలు... విరిబోణీ... అవి తీయని కలలు. మరచిపో.

కనక: ఎలా మరచిపోతాను - గురూ - నా చిరునవ్వు మీ సంగీతస్వరమై పలికింది. నా కనుచూపు మీ రాగాలాపనమయింది. నా మనోల్లాసం మీ తానవర్ణమయింది. ఎలా మరచిపోను?...

ఆది: కనకం...

కనక: మిమ్ములని విడిచి ఎలా జీవించగలను?...

ఆది: విరిబోణి నేను మాత్రం...

కనక: మీకేం? సంగీతం ఉంది. మీ వర్ణాల్లో జీవిస్తారు. రాగాలాపనల్లో సుఖిస్తారు.

ఆది: నీవూ కలకాలం ఈ వర్ణంలో జీవిస్తావులే.

కనక: తప్పదా. నాకీ మహోత్కృష్ట రాణీవాసం...

ఆది: కాదు. అది నీవిధి. మా యందరి కోసం.

కనక: క్షమించండి. మీ యభీష్టము నెరవేరుస్తా. ఇంక సెలవివ్వండి...

ఆది: ఎంత ముద్దరాలు పాపం విరిబోణి!

[కామాక్షి ఆలయంలో గంటలు]

(ఆలిండియా రేడియో ప్రసారితం)





## 42

పద్మకి నెలరోజుల్నుంచీ శేఖరంజాడ తెలియటంలేదు. ప్రస్తుతమున్న ఇంటద్దె భరించటం కష్టం. ఒకడి సహాయంతో ఆమె బెజవాడ మారుమూల ఒక పూరిగుడిసెలోకి మకాం మార్చేసింది. శేఖరం కొనిచ్చిన ఫర్నిచర్ అంతా అమ్మేసింది. అతను పెట్టిన నగలు అమ్మజూపితే కవరింగునగలని తెలిసింది. వుసూరుమంది ప్రాణం. కాని రోజువారీ జీవనానికి లోటులేకండా జరిగిపోతూంది. ఇటువంటి స్త్రీలకోసం తిరిగేవారా బస్తీలో వందలున్నారు. వాళెవరో ఏమిటో, ఎటువంటివాళ్ళో ఆమెకనవసరం. వాళ్ళ చేతిలో డబ్బొక్కటే ఆమె కిప్పుడు ప్రధానం.

ఆమెరోజూ అద్దంలో తనవంక తను చూసుకుంటూ వుంటుంది. తనలో మార్పులు కనపడుతున్నాయి. దారుణమైన వ్యాధులు లోన జీర్ణించివున్నా, మొహం కొంచెం మొరటు దేలినా, నిగనిగమాత్రం తగ్గలేదు. అయితే ఎందుకో అలంకరణ అంటే నిర్లక్ష్యం హెచ్చింది. తప్పనిసరిగా బలవంతాన అలంకరించుకోడం తప్పటంలేదు; నవ్వకనూ తప్పదు.

లేత కుర్రాళ్ళని చూసినప్పుడల్లా ఆమెకు అనిపిస్తూ వుంటుంది—'నేను నరకాన్ని. వెళ్లిపో—చెడిపోతావు' అని చెప్పి హెచ్చరికచేదామని. కాని అట్లా చెబితే ఆమెకి జరగదు. ఒక్కరోజూ వెళ్ళదు.

ఆమెదగ్గిర రెండుమూడువందల రూపాయలున్నాయి. జాగ్రత్తగా కూతురుకోసం దాచింది. ఎప్పటికన్నా కూతుర్ని భాస్కర్రావుకి అప్పజెప్పాలని ఆమె తాపత్రయం. వేసవికాలం ఒకనాడు సాయంత్రంపూట తన పూరింటివాకిట్లో నుంచుని నిరీక్షిస్తూంది. కనుచూపుమేర ఎవరూ కనపడడంలేదు. ఇరుగు పొరుగు పూరికొంపల్లో వాళ్లుకూడా పతితలే. వాళ్ళూ బైటే నుల్చుని నిరీక్షిస్తున్నారు.

అదేసమయాన, ఒక పోలీసు తయారైనాడు. అతనిదృష్టికి పద్మ కొత్తగా కనిపించింది. లోపలికి వచ్చాడు. బెదిరించాడు. అతనికాళ్లమీదపడి ఏడ్చింది. తను ఏ నేరమూ చెయ్యలేదంది. పసిపాపనిచూసైనా కనికరించి వొదలమంది.

"పద స్టేషన్కి. అక్కడ చెబుదువుగాని." అంటున్నాడు ధర్మరక్షకుడు. అతనిదృష్టంతా ఆమెవొంటిమీద కవరింగ్ గోల్డు నగలమీదే. ఎంత డబ్బు పోగుచేసిందో అని ఆలోచిస్తున్నాడు. ఏడుస్తోంది అబల. పోలీసు పోతపోసిన లోహవిగ్రహం. కన్నీళ్లు కదల్చవు ఆ విగ్రహాన్ని.

"ఇదిగో, ఈ ఏడ్పులేమీ సాగవు. మా ఇన్స్పెక్టర్ గారు మహా కరెక్టు. ఆయ నేవస్తే నీ వెముకలు విరిగిపోతాయి జాగ్రత." అంటున్నాడు. ఇంతలో పొరుగునవున్న ఒకామె వచ్చింది. ఆమెకి ఈ పోలీసు పరిచయమే. పోలీసులు ఇట్లాగాక ఎట్లా వుంటారో ఆమెకి తెలీదు. "ఏందండీ, అయ్యగారూ" అంది పొరుగింటామె. "స్టేషన్కి లాక్కుపోవడానికి వచ్చాను. మర్యాదగా రమ్మను." అన్నాడు పోలీసు.

పోలీసుస్టేషన్కిపోతే, ఏంమర్యాద జరుగుతుందో పొరుగామెకి బాగా తెలుసు. లాఠీలతో ఎముకలు విరగ్గొడతారు. కొందరు పుణ్యాత్ములు స్త్రీ అంటే మొహం వాచినట్టు మొరటుగా ప్రవర్తిస్తారు.

"అమ్మాయా, ఇట్లారా"అని పొరుగామె లోపలికి పిలిచింది. "ఆ చచ్చినాడికి, ఓ ఏభై తగలెయ్యి, పోతాడు. నాలుగు నెలలపాటు ఇటురాడు" అంది. పద్మ 'సరే' అంది. తన నిల్వలో నుంచి ఏభై లెక్కపెట్టి పోలీసుకిచ్చేసింది. అది ఎంత జాగ్రతగా దాచిన డబ్బు! ఒళ్లుఅమ్మి పోగుచేసినడబ్బు! ఇష్టంవున్నా లేకపోయినా మొరటుమనుషులకులొంగి లోలోపల బాధపడుతున్నా, పళ్లు బిగపట్టుకుని, పైకినవ్వుతూ, సంపాయించిన డబ్బు! దాన్ని...ఇట్లా, ఉచితార్థంగా ఇవ్వాల్సివస్తోంది. కాని ఏం చేస్తుంది? అబల! కన్నీళ్లాపుకో లేకుండా వుందామె. పోలీసు వెళ్లిపోయాడు.డబ్బు జేబులో వేసుకుని. ఆమె లోపలిగదిలో కోదండరాముడి పటం ముందుపడి, గోడుగోడున ఏడ్చింది. కల్లోలమైన మనస్సుకి శాంతికోసం, 'వైష్ణవజనతో తేనేకహియే' అని దారుణమైన శోకంలో ఆలాపించింది. పద్మ ఆరాత్రల్లా కూతుర్ని కావలించుకుని ఏడ్చింది. తన దుర్గతిని తల్చుకుని కుమిలిపోయింది. ఆమెకి గుండెల్లో పోలీసు భయం అతిగాఢంగా నాటుకుపోయింది. ఇట్లాగూడా తనను బతకనివ్వరా? తన నిల్వ డబ్బంతా ఇలాగే లాగేస్తారేమో. పోలీసులు! తనకూతురుకింక ఏమీ మిగల్చలేదా

తను? భాస్కర్రావు దగ్గరకి వెళ్ళిపోతే ఇప్పుడే?... కాని అందుకూ మనసొప్పటం లేదు... తనింక ఏగతికి పోయినా ఇబ్బందిలేదు— తనకూతురు సమస్యే!......

ఆమె మర్నాడు అలంకరించుకుని సినిమాకి వెళ్ళింది. అక్కడ ఎవరైనా దొరుకుతారేమో! లేదా శేఖరం కనపడతాడేమో! పాపని పొరుగింటిలో ఒక ముసలమ్మకి అప్పజెప్పింది. సినిమాహాలు ఫర్లాంగుదూరంలో వుంది. రెండో ఆట మొదలెట్టే దాక అక్కడేవుంది. పక్క టీ దుకాణంలో రెండుసార్లు టీ తాగింది. ఎవరూ రాలేదు, శేఖరం కనపడలేదు. విసిగి తిరిగి ఇంటిదోవ పట్టింది.

ఇల్లు కనుచూపు మేరలో ఉండగా ఆమె ఉలిక్కిపడింది. తన ఇంటిలోనుంచి బలాఢ్యుడొకడు అప్పుడే వస్తున్నాడు. అతని చేతిలో బాకు తళుక్కుని మెరిసింది.

ఆ గూడెంలో అతనంటే అందరికీ హడలే. పేరు దౌలత్. ఒళ్ళమ్ముకుని జీవించే పతితల్ని హింసించి వాళ్ళ డబ్బు లాక్కుంటాడు. ఆమెకి గుండె లాగి పోయాయి. తటాల్న పక్క గుడిసె చాటుకి పరుగెత్తి చీకటిలో దాక్కుంది. కొంతసేపటికి పక్క గుడిసెలోనించి ఆర్తనాదం వినపడింది. ఆమె గుండె లవిసి పోయాయి. కాని ఈ ఆర్తనాదం ఎవరి చెవినీ పడదు. పరువుప్రతిష్ఠలచాటున పెద్దమనుషులు సుఖంగా నిద్రపోయే వేళ అది. ఇటువంటివి ఇక్కడ అలవాటే. చుట్టుపక్కల వాళ్ళకి దౌలత్ అంటే భయం. ఎవరూ సాయం చెయ్యడానికి రారు. మళ్ళీ ఆర్తనాదం వినపడింది.

"ఊ! తియ్యి! ఎక్కడ దాచావే!..." అంటున్నాడు దౌలత్.

"చెయ్యివొదులు. బాబ్బాబు. నీకు దణ్ణం పెడతా..." అంటోంది నిర్భాగ్యురాలు.

"దబ్బున తియ్యి డబ్బు... లేకపోతే చెయ్యివిరిచేస్తా."

"ఇస్తాఇస్తా...వొదులు..."

ఆమె ఇంక నిలవలేకపోయింది. చుట్టు తిరిగి తన ఇల్లు చేరుకుంది. తలుపులు బార్లా తీసివున్నాయి. ట్రంకుపెట్టె ఖాళీగా వుంది. బట్టలు చిందరవందరగా విరజిమ్మి ఉన్నాయి. డబ్బు దాచుకొన్న కవరు మాయమైంది. పరుగుపరుగున పొరుగింటికి వెళ్ళింది. ముసలమ్మదగ్గిర నిద్రపోతున్న పాపాయిని అందుకుని గుండెల కదుముకుంది. భోరున ఏడుస్తూ తన యింట్లోకి పోయి మంచంపైన పడిపోయింది. పాపాయి నిద్రలేచి ఏడవసాగింది. పాపకోసం కాని కానిచొప్పున చేర్చి పేర్చిన కాస్త డబ్బూ పోయింది. తెల్లారి బతుకుతెరువుకైనా కాని డబ్బులేదు. రాత్రి నిద్రపట్టలేదు. పాపమాత్రం నిద్ర పోయింది. తెల్లారేముందు కొద్దిగా కలతనిద్ర. ఆకలతనిద్రలో పెద్దమనుషులరూపంలో దొంగలు, మనుష్యులరూపంలో పిశాచాలు, పోలీసులరూపంలో రాక్షసులు కనపడ్డారు. కలతనిద్రలో ఏడ్చింది. విలవిల తన్నుకొని మంచంమీద నుంచి కిందపడింది. మెలకువ వచ్చేసరికి తెల్లగా తెల్లవారింది.

# 43

ఆ వేళ సాయంత్రంకూడా మామూలు ప్రకారం పద్మ సినిమా హాలు దగ్గిరకి వొచ్చింది. రోజూలాగే టీ దుకాణం దగ్గర నిలబడి టీ తాగింది. టీ కొట్టువాడామె దగ్గిర డబ్బులు తీసుకోడు. ఆ కాసేపు ఆమెతో సిచ్చి పిచ్చిగా వాగి సంతోషిస్తాడు. హాలు ముందు పాదరసపు ట్యూబ్ బల్బుల కాంతి దేదీప్యమానంగా వెలుగుతోంది. పద్మ ఆశగా వొచ్చే పోయే వాళ్ళను చూస్తోంది. టీ కొట్టు యజమానితో మాట్లాడుతూ.

## రచయిత 'శారద'

'మంచీ - చెడూ' నవల రచించిన వారి ఊరు, పేరు అడుగుతూ నవలను ప్రశంసిస్తూ పలువురు వ్రాస్తున్న లేఖలను బట్టి ఈ నవల పట్ల పాఠకలోకం చూపుతున్న ఆదరాభిమానాలు వ్యక్తమౌతున్నాయి. రచయిత 'శారద' గారి నివాసం తెనాలి. పేరు శ్రీ యస్. నటరాజన్. తమిళులైనప్పటికీ, పగలంతా సెర్వర్‌గా హోటల్లో పని చేస్తూ కూడా, స్వయం కృషివల్ల తెలుగు, ఇంగ్లీషు భాషలు నేర్చి తెలుగులో రచనలు సాగిస్తూ తెలుగు పాఠకలోకం ఆదరాభిమానాలను చూరగొన్న 'శారద' గారు అభినందనీయులు.

—సంపాదకుడు.

సినిమా మొదలు పెట్టే వేళకి హాల్లో గంట గణగణ మోగింది. పద్మ చుట్టూ చూస్తోంది. దూరంగా భాస్కర్రావు వస్తుండడం చూసింది. పారిపోదామా, నిల్చుందామా అని ఆలోచించింది. కాని, ఆలోచన పూర్తికాకముందే భాస్కర్రావు దగ్గిరికి వచ్చేశాడు. సిన్నిని గుర్తుపట్టాడు. "సిన్నీ" అన్నాడు బిగ్గరగా. కొట్లో టీ తాగేవాళ్ళు వలుగురూ అటు వేపే చూస్తున్నారు. పద్మ "ఎవరూ? భాస్కరమా!" అంది, ఆశ్చర్యపడ్డట్టు నటిస్తూ. ఆమెలో ద్వంద్వ భావాల సంఘర్షణ అంతరించిపోయింది. ఇతన్ని ఇంటికి తీసుకుపోయి పాపాయిని అప్పజెప్పేస్తే తన భారం నొగులుతుంది. "అవును సిన్నీ! ఇదేమిటి! నువ్వు చాలా మారిపోయావు!" అని ఆదుర్దాగా అడిగాడు భాస్కర్రావు.

పద్మ, రోడ్డు మీదికి అడుగు వెయ్యబోతూ, 'ఇంటికి వెళ్ళి మాట్లాడుకుందాం పద. ఉండు టీ తాగుతావా?' అంటూ నాయర్ వైపు చూసింది. భాస్కర్రావు "వొద్దులే సిన్నీ" అంటూ నడవసాగాడు.

"ఉండనోయ్, టీ తాగి వెళ్దాం" అంది పద్మ.

"సరి నువ్వు కూడా తాగు" అన్నాడు భాస్కరం. అతను ఆశ్చర్యపడుతున్నాడు — ఎన్నడూ ఇల్లు కదిలి బైటికి రావడమే ఎరగని సిన్ని—ఇట్లా సినిమాకి వొంటరిగా వొచ్చిందే" అనుకుంటున్నాడు. టీ కొట్టతను రెండు టీలు కలిపియిచ్చాడు. గబగబ టీ తాగారు ఇద్దరూ. భాస్కర్రావు డబ్బు లివ్వబోయాడు. నాయర్ తీసుకోలేదు. "అమ్మగారిస్తారు లెండి" అన్నాడు. భాస్కర్రావు సంశయంతో, పద్మ వేపు చూశాడు. పద్మ నవ్వింది.

"పద ఇంటికి; అన్నీ చెబుతాను. టీ డబ్బులు నేనిస్తాలే" అంటూ ముందు నడవసాగింది. భాస్కర్రావు. "ఇటు సిన్నీ, మా యింటికి ఇటు గాంధీనగరం వేపువెళ్ళాలి. మర్చి పోయావా?" అన్నాడు రోడ్డుమీద ఆగి.

"కాదులే భాస్కరం, ముందు నా యింటికిరా. తర్వాత చెబుతా" అంటూ, నడక సాగించింది. ఫర్లాంగుదూరం నడిచాక అన్నీ చిన్నచిన్న పూరిగుడిసెలు, ఒంటి నిట్టాడు పాకలు, వెన్నెట్లో కనిపిస్తున్నాయి భాస్కర్రావుకి. గుడిసెల బైట పడుచు పిల్లలూ నడివయసుస్త్రీలూ మల్చునిస్తున్నారు. కొందరు పురుషులూ

# ★ మంచీ - చెడూ ★

వాళ్ళక్కడే కూర్చుని, యథేచ్ఛగా జోకు లందుకుంటూ మాట్లాడుకుంటున్నారు.

భాస్కర్రావుకి ఈ ప్రాంతం వినికిడిగా తెలుసు. 'ఇదేమిటి! పిన్ని ఇటొస్తోంది? అనుకుంటూ నడుస్తున్నాడు. పద్మ ఆ కొంపల మధ్య ఒక ఇంటిలోకి దారి తీసింది. భాస్కర్రావు ముందట జంకాడు లోపలికి పోవటానికి. పద్మ, ఇంట్లోకి వెళ్తూ "రా భాస్కరం" అంది.

భాస్కర్రావుని తీవ్రమైన అనుమానం బాధిస్తోంది. లోపలికి వెళ్ళాడు. అక్కడ ఓ కుక్కి మంచం, ఓ యీతాకుల చాప వున్నాయి. దణ్ణెంమీద విడిచిన చీర వేళ్ళాడుతోంది. ఓ మూల బీడీ పీకలూ, సిగరెట్టు పీకలూ పడివున్నాయి. ఓ బెడ్‌రూం లైటు నిశ్చలంగా అన్నిటికీ సాక్షిగా వెలుగుతోంది. భాస్కర్రావు అనుమానం తీవ్రమౌతోంది. అతను మంచంమీద కూర్చోబోతూ నిద్రపోతున్న పాపాయి వంక చూశాడు. ఈ పాపాయి ఎవరు!—

"ఈ పిల్ల ఎవరు పిన్నీ?" అని అడిగాడు కూర్చుంటూ.

"నీ చెల్లెలు భాస్కరం. నా కూతురు" అంది మెల్లిగా.

"ఏమిటిదంతా పిన్నీ! నువ్వు ఈ కొంపలో వుండటమేమిటి నా కళ్ళు నేను నమ్మలేకుండా వున్నాను పిన్నీ" అన్నాడు భాస్కరం తీరని బాధతో.

పద్మ మాట్లాడకుండా భాస్కర్రావుని లోపలి మరోగదిలోకి తీసుకెళ్ళింది. పాపాయిని కూడా తెచ్చి చాపవేసి పడుకోబెట్టిం దక్కడ. "ఇక్కడ కూర్చుని చూస్తూవుండు భాస్కరం. నేను నా నోటిమీదుగా చెప్పలేని విషయాలన్నీ నీకే అర్థమౌతాయి. అని చెప్పినా అర్థంకావు కూడా. ఏం జరిగినా సరే బైటికిమాత్రం రాకు." అంటూ ఆమె బైటి గదిలోకి వెళ్ళబోతూ.

"మాట్లాడు పిన్నీ. ఎంతకాలమైంది నిన్ను చూసి! ఎచ్చే నువ్వు ఇక్కడేమిటి అసహ్యంగా. పద మనయింటికి. పాపాయిని తీసుకురా." అన్నాడు భాస్కర్రావు లేవబోతూ.

"కూర్చో నాయనా" అని పద్మ అతని భుజాలు పట్టుకుని కూర్చోబెట్టింది. "నా కథంతా నేను చెప్పలేను. నేను చెప్పినట్టుగా నువ్వు ఇక్కడే ఉండి నీ కళ్ళతో చూడు. తర్వాత మిగిలింది నేను చెబుతా." ఆమెకి దుఃఖం గుండెలు చీల్చుకొని పొంగి వస్తోంది. అయినా ఆపుకుంది.

"ఏమిటో పిన్నీ ఏదో దాస్తున్నావు. నాదగ్గిర - నీకేం దాపరికం చెప్పు పిన్నీ?" అంటున్నాడు భాస్కర్రావు.

ఇంతలోనే బయట ఎవరో పిలుస్తున్నారు. "నువ్విక్కడే వుండి చూస్తూవుండు. కదలకు సుమా. ఏం జరిగినా బైటకు రాకు. నామీద ఒట్టు" అంటూ వెళ్ళిపోయింది పద్మ.

భాస్కర్రావు పరిపరివిధాల ఆలోచిస్తూ తడికవైపే చూస్తున్నాడు. ఎవరో ఇద్దరు మొగవాళ్ళు, ఇద్దరు ఆడవాళ్ళు వచ్చారు, లాంతరు పట్టుకుని. అందరూ కిందనే కూర్చున్నారు, ఒకరి కభిముఖంగా ఒకరు. అందులో పొడుగ్గావున్న మొగాడు పద్మ భుజం మీద చెయ్యేసి, "ఇయ్యాళ కాసేపు చీట్లాడుకుందామని ఈడకి వచ్చాం. నువ్వూ ఆడుదువుగానిలే. నీ కేదినా గిరాకీవస్తే వెళ్ళిపోతాం" అంటూ ఆమెని తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

భాస్కర్రావుకి ఒళ్ళు భగభగ మండిపోయింది. తన పిన్నిని వాడు ఆ మాటలనడం! అట్లా ఒంటిమీద చెయ్యేసి లాగడం! కాని పిన్ని ఏమీ అనదేం! చీట్లాట ఆరంభమైంది. అందరూ సిగరెట్లు వెలిగించి హుషారుగా ఆడుతున్నారు. మధ్యమధ్య విన రాని మాట లంటున్నారు. భాస్కర్రావు వినలేక చూడలేక పోతున్నాడు.

రాత్రి పదిదాటింది; పదకొండయింది. ఇంతలోనే ఎవరో బైట నిలబడి పిలుస్తున్నాడు. పద్మ, "ఇక పొండి" అంది. అందరూ వికవికలాడుతూ లేచి వెళ్ళిపోయారు. తరవాత ఒకడు లోపలికి వచ్చాడు దర్జాగా. యువకుడే. సిల్కుదుస్తులు వేసుకున్నాడు. తిన్నగావచ్చి మంచంమీద కూర్చున్నాడు.

"ఇక్కడే వుండు. లోపలికి పోయి నీళ్ళు తాగి వస్తా" అంటూ ఆమె లోపలికి వచ్చింది. సన్నని గొంతుతో. "భాస్కరం! అట్లా చాపమీద పడుకో. ఏమీ అనుకోకు. నా ఖర్మ ఇట్లా కాలింది. నేనొచ్చి లేపుతాలే, ఆ తర్వాత అంతా మాట్లాడుకుందాం; పడుకుంటావా?" అనేసి గబగబ వెళ్ళిపోయింది. మధ్య తడిక తలుపు బిగించింది.

భాస్కర్రావు చప్పున వూహించుకున్నాడు. అతనికి కళ్ళు తిరిగిపోయాయి. గట్టిగా కళ్ళుమూసుకుని ఆలోచించసాగాడు. అతని పక్కనే పాపాయి ప్రశాంతంగా నిద్రపోతోంది. కళ్ళయితే మూసుకున్నాడుగాని చెవులో! బైట గదిలో మొరటు మాటలు వినిపిస్తూనేవున్నాయి. భాస్కర్రావు మనసు మనసులో లేదు. పిచ్చెత్తిపోయింది.

ఓ రెండుగంటలకల్లా పద్మ తలుపు తెరుచుకుని తూలుతూ తూలుతూ లోపల గదిలోకి వచ్చింది. వాడెవడో వెళ్ళిపోయినట్టున్నాడు. భాస్కర్రావు లేచి కూచున్నాడు. పద్మ దీపం వెలిగించింది. ఆమె మొహం వివర్ణమైపోయివుంది; కళ్ళు కాంతిహీనంగా వున్నాయి.

"భాస్కరం..." అంది పద్మ. ఇకపైన నోటిమాట పెగిలి రాలేదు. కట్టలు తెంచుకుని వస్తున్న ఏడ్పు దిగమింగుతోంది.

"వొద్దు పిన్నీ చెప్పకు అంతా తెలిసింది. ఇదేమిటి పిన్నీ! నువ్వీ నరకంలో ఎలా పడ్డావు! ఛీ-ఛీ-నాతో వచ్చెయ్యి. నా దగ్గిర వుండిపోదువుగాని! రా—వెళ్ళిపోదాం. ఇక్కడొక్క క్షణం ఉండొద్దు" అంటున్నాడు ఉద్రేకంతో భాస్కర్రావు.

"లేదు, లేదు. వుండు. తొందరపడకబ్బాయి! ఇక నేను నీతో వొచ్చే ఆస్కారంలేదు. నేనిప్పుడు ఏపూట కాపూట కూటికోసం ఒళ్ళు అమ్ముకుని బతుకుతున్న పాపిష్టిదాన్ని. మీ అందరి మధ్యకీ రావడం ఇంక పడదు."

"అదేమిటి పిన్నీ! నన్నెరగవా? నేను ఎవరికీ భయపడను, తెలుసా! రా నాతో. నామాట విను." భాస్కర్రావు పట్టుదలగా వాదిస్తున్నాడు.

పద్మ కళ్ళు తుడుచుకుంటుంది. "అది సరే భాస్కరం! నువ్వు భయపడవు! నీ మేనత్త వాళ్ళూ వూరుకుంటారా? అన్నట్టు నీకు పెళ్ళయిందా?"

"పెళ్ళయింది పిన్నీ. నేను ఉండటం ఇప్పుడు మామగారింట్లోనే. నాతో వచ్చేసెయ్యి పిన్నీ. ఈ మహానరకంలో నువ్వుండడం ఇంక భరించలేను పిన్నీ" అంటూ చేతుల్తో మొహం కప్పుకున్నాడు.

"నువ్వొక్కడివీ రమ్మంటావు. కాని అందరూ ఒప్పుకోరు భాస్కరం. వాళ్ళూ మనుషులే. వాళ్ళకి పరువుప్రతిష్ఠ లడ్డం వస్తాయి. నీఉద్యోగంకూడా వూడిపోవచ్చు. అటు బైటా పోరు, ఇంట్లోనూ పోరూ అవుతుంది. ఇటుచూడు, భాస్కరం! నేను, మనసారా చెబుతున్నానుగా, నేను చెడిపోయినదాన్ని. నా

శరీరం రోగభూయిష్టమైపోయింది. నా మనసుకూడా స్తిమితం తప్పింది. నన్ను చూస్తేగానే నే నెట్లాంటిదాన్నో అందరూ గుర్తించగలరు! ఇదిగో చూడు" అంటూ ఆమె బుడ్డి దీపం మసక వెలుగులో, చేతులుచాపి చూపించింది. చేతులమీద నల్లని, ఎర్రని మచ్చలు స్పష్టంగా కనిపించాయి.

భాస్కర్రావు వొణికిపోయినాడు. "పిన్నీ!" అంటూ రోదించసాగాడు. ఎంతో సుకుమారంగా, ఆరోగ్యంతో నవనవలాడుతూవున్న పిన్ని, ఈరోజున ఎలా వాడిపోయింది!

"భాస్కరం నాకు ఇక మిగిలింది, ఇంకా కొన్నాళ్ళు యౌవ్వనం; కాని ఆ ధైర్యంతో నేను పాపాయిని పెంచలేను. పాపాయిని నీకిచ్చి నాబతుకు నేను చూసుకుంటాను" పద్మ అప్యాయంగా భాస్కర్రావు తలనిమర నారంభించింది.

"కాదుపిన్నీ. అట్లా జరగడానికి వీల్లేదు. నాతో వచ్చెయ్యి లేరా."

"వొద్దు. నీకు తెలీదు భాస్కరం, ఈ మనుషుల సంగతి. నన్నుగురించి నిన్నుకూడా బాధపెడ్తారు. వుద్యోగం పోతుంది. ఇంకేబాధయినా సహించొచ్చుగాని, ఆకలిబాధ భరించలేం నాయనా. దానివల్లే నేనీగతికి వచ్చాను." పద్మ తనకథంతా పూసగుచ్చినట్టు చెప్పింది.

బుడ్డి దీపం వెలుగులో రాత్రి రెండుగంటలవేళ, నిరామయమైన వాతావరణంలో భాస్కర్రావు పిన్ని కథంతా విన్నాడు. కన్నీళ్లు ధారలు కట్టాయి. ఆవేశపడ్డాడు. బాధపడ్డాడు. బాధ అణుచుకోలేక ఠటాలున లేచి నిలబడ్డాడు.

పద్మ అతణ్ణి పట్టుకొని కూర్చోబెట్టింది; "నువ్విప్పుడేమీ చెయ్యలేవు భాస్కరం! నన్ను ఉద్ధరించలేవు. నామీద నీకెంత గౌరవం ఆపేక్ష ఉన్నాయో నేనెరుగుదును. నీ వాత్సల్యం ఎరుగుదును. కాని దానికి సమయం మించిపోయింది. భాస్కరం! నా కూతుర్ని నీకిచ్చేస్తాను. దాన్ని జాగ్రత్తగా పరువు ప్రతిష్ఠలు గల సమాజంలో పెంచు. నాగతి చూశావుగా! పాపాయిని అట్లా గాకుండా పెంచి కాపాడు బాబూ! నువ్వు నాకు చెయ్యగల సహాయం అదొక్కటే...దానికోసం నేను పోగుచేసిన డబ్బంతా విలువునా దోచుకుపోయినారు!..." అంటూ పద్మ గతమంతా కళ్లకు కట్టినట్లయి ఘోరున ఏడవసాగింది. భాస్కరం పిన్నిని సముదాయిస్తూ "ఏడవకుపిన్నీ" అంటున్నాడు. అనునయవాక్యాలే ఎరగని ఆయువతికి దుఃఖం మరింత పొంగి పొరలిపోయింది. ఆమె భాస్కర్రావుపాదాలమీద వాలిపోయింది. భాస్కర్రావు ఆమెని లేవదీసి, పసిబిడ్డని పొదివి పట్టుకున్నట్లు మెల్లిగా ఆమెని గుండెలకు హత్తుకున్నాడు. ఆమె కన్నీళ్లు తుడిచాడు. "ఎల్లా బవాయావు పిన్నీ! ఏ ఘోరపాపం చేశావని నీకీగతి! ఏడవకు. లే. పాపాయిని నేను పెంచుతాను. సరే! నా సర్వస్వం ధారపోసి అయినా సరే పాపాయిని ఉన్నతదశలోకి తెస్తాను." అన్నాడు.

కొంతసేపటికి పద్మ శోకం కొంచెం చల్లారింది. ఆమె అట్లాగే భాస్కర్రావుని అంటిపెట్టుకు నేవుంది. ఆ సమయంలో ఆమె మనస్సు అతినిర్మలంగావుంది. దీర్ఘకాలం దుర్భరజీవితం అనుభవించి ఈనాటికి ఒక్క నిజమైన మానవుడి హృదయపూర్వకమైన ప్రేమవాత్సల్యాల నీడలో సేద తీర్చుకుంటోంది. అట్లా ఆయిద్దరు అరగంటసేపు మౌనంగా ఉండిపోయారు.

తరవాత పద్మ తేరుకుంది. "భాస్కరం! తెల్లారకముందే వెళ్ళిపో. పాపాయిని తీసుకువెళ్లు. నన్నుగురించి ఆలోచించకు. నన్నుగురించి ఎక్కడా చెప్పకు. పాపాయికికూడా చెప్పకు. పిన్ని చచ్చిపోయింది. ఈపాప తల్లీతండ్రీలేని అనాథ. ఇక దానికి అన్నీ నువ్వే." అంది గద్గదస్వరంతో.

"అలా కాదుపిన్నీ. నువ్వూ నాతో రా. ఈవూరు కాకపోతే ఇంకోవూరు. రా నాతో." అన్నాడు భాస్కరం.

"మళ్ళీ పొరపాటుపడుతున్నావు భాస్కరం! ఇంక నువ్వేమీ బాధపడకు. నేనేదో అగాధంలో పడిపోయాను. అందులోంచి ఇంక బైటపడటం అసంభవం. నువ్వు పాపాయిని తీసుకెళ్లు లే బాబూ! తెల్లారకముందే ఈ నరకంనించి వెళ్లిపో. అంతా అనుమానంగా చూస్తారు. వెళ్లు ఇదిగో నాదగ్గిర నాలుగు రూపాయలున్నాయి. పాపాయికి చొక్కా కుట్టించు...వెళ్లు" అంటూ పద్మ, కొంగు ముడివిప్పి నాలుగు రూపాయలు తీసి భాస్కర్రావుకివ్వబోయింది. భాస్కర్రావుకి దుఃఖం ఆగలేదు. "వొద్దు-వొద్దు-పిన్నీ — నే నున్నాను పాపాయికి! నీకు మా కుటుంబం చేసిన అన్యాయానికి పరిహారం నే నిస్తాను. ఇది నీకు ఉపకారం కాదు" అంటూ లేచాడు భాస్కర్రావు, దృఢసంకల్పంతో. పిన్ని రాదు. ఆమెని మార్చటం సాధ్యంకాదు. పాపాయిని తీసుకెళ్ళటమే....

"నువ్వు రానంటున్నావుగాను పిన్నీ!..."

"నేను రాలేను బాబు, పాపాయిని తీసుకుపో. అదిగో, తాలూకాలో మూడుగంటలు కొడుతున్నారు. వెళ్లు..." పద్మ నిద్రపోతున్న పాపాయిని ఎత్తుకుని ముద్దాడి భాస్కర్రావుకిచ్చింది. లోలోపల కుమిలిపోతోంది ఆవేదనతో. పెట్టె తెరిచి పాపాయికి కుట్టించిన చొక్కాలూ ఆటవస్తువులూ మూటగట్టి యిచ్చింది. తిరిగి తన కొంగున డబ్బులుతీసి భాస్కర్రావుకిస్తూ, "సంవత్సరాదికి పాపాయికి గుడ్డముక్క తీసుకో...నామాట విను; నా బంగారానికి... నేను ఇంకే మివ్వగలను?" అంటూ ఆమె తిరిగి దుఃఖం ఆపుకోలేక ఏడ్వసాగింది.

భాస్కరం నిశ్చేష్టుడై నిలబడ్డాడు. బయట వెలకుంటుతోంది. చల్లని ఉదయవాయువులు వీస్తున్నాయి. అంతటా అతి ప్రశాంతంగా వుంది.

"ఏడవకు పిన్నీ, అప్పుడప్పుడు వచ్చిపోతుంటాను." అన్నాడు గద్గదకంఠంతో.

"వద్దు నాయనా! ఇంక ఇటు వేపు రాకు. పాపాయి నా కూతురన్న సంగతి మర్చిపో. వెళ్లు. అసలు నే నున్నానన్న సంగతే మర్చిపో. ఇటు రావద్దు. ఇంక నేనిక్కడ వుండను. ఎక్కడికి పోతానో! తెలియదు." ఆమె ఆకాశంవంక చూసింది.

గడపదాకా వచ్చి వదిలిపెట్టింది. నాలుగుసార్లు పాపని ముద్దెట్టుకుంది. ఇక నుంచుంటే లాభంలేదని లోపలికి పరుగెత్తింది. ఆమె మనస్సు వికలమైపోయింది. వలవలా ఏడుస్తూ కోదండరాముడి పటంముందు పడిపోయింది.

భాస్కర్రావు కన్నీళ్లు తుడుచుకుంటూ రోడ్డుమీదికి రెండడుగులు వేశాడు. ఇంట్లోనుంచి పద్మ హృదయవిదారకంగా మనశ్శాంతికోసం రోదిస్తోంది.

భాస్కర్రావు ఒకసారి వెనక్కి తిరిగిచూశాడు. తర్వాత మెల్లిగా అడుగులేసుకుంటూ, నిద్రపోతున్న పాపని, భుజాలమీద పడుకోపెట్టుకుని, పశ్చిమాన కుంకుతున్న చంద్రుని వేపుగా, ఆ సన్నని, ఎర్రని మరణకాంతిలో, చీకటి తెరలలో కలిసిపోయాడు. అతని వెనకనే—పద్మ ఏడ్పు సన్నగా హృదయవిదారకంగా, వినిపిస్తూ అంతరిక్షంలో అంతరించిపోయింది.

[సమాప్తం]

# 4 ఔషధములు చేరినట్టిది

అనాసిన్ శాస్త్రయుక్తంగా నాలుగు ఔషధముల కలయికతో తయారింపబడినది. త్వరితంగ బాధనివారణకై హామీయిచ్చుటకు కారణం, ఇందులో కలసియుండు ఈ ఔషధములే.

1. క్వైనైన్: అధిక శక్తినిచ్చు ఔషధమని మరియు జ్వర నివారణియని ప్రఖ్యాతిగాంచిన ఔషధ సమ్మేళనం. జ్వరాన్ని తగ్గించడంలో సాటిలేనిది.

2. కఫీన్: బలహీనానికి మరియు చిక్కిపోయినందు లకు తగిన ఔషధమని విరివిగా వాడబడుచున్నది.

3. ఫినాసిటిన్: తీవ్రమైన బాధా నివారణి మరియు జ్వర నివారణియని ఖ్యాతిచెందినది.

4. అసిటైల్ సాలిసిలిక్ ఆసిడ్: ఇది తలనొప్పి, మరియు అలాటి సాధారణ బాధలను పోగొట్టుటకు ఉపయోగబడు చున్నది.




వైద్యశాస్త్ర రీత్యా ఏక సమ్మేళన శక్తిచేత అనాసిన్ మాత్రం, త్వరితంగాను, నిరపాయంగాను, దృఢంగాను, బాధలనుండి, తలనొప్పి, జలుబు జ్వరం, దంతపు పోట్లు, కండరముల పోట్లు, వాయువు నొప్పులు మొదలగు బాధలను నివారించును.

ఎల్లప్పుడును

# అనాసిన్

బిళ్లలే

కావలెననికోరండి





2 మాత్రలుగల పాకెట్లలందును. మరియు 32 మాత్రలు

# కుక్క తోక

## దేశరాజు శేషగిరిరావ్

సరిగ్గా భోజనాలవేళ. వీధి తలుపుమీద దబ్బు దబ్బున చరుపులు వినబడుతూంటే శ్రీమతి ప్రశ్నార్థకంగా నాకేసీ, విసుగ్గా వీధికేసీ చూస్తోంది. హూ! ఎవరో ఆపద్బాంధవుడు - సరాసరి భోజనాలవేళ - సిరికిం జెప్పడు - అన్నట్లు వచ్చాడు. కుర్రాడు కుడిచేతిలో మెతుకులు కంచంలో దులుపుతూ ఎడంచేత్తో జారిపోతున్న లాగూని మొలత్రాటిలో దూరుస్తూ వెళ్లాడు తలుపు తీయటానికి.

"పోస్టుమాన్ కామోసు" అన్నాను.

"మా అన్నయ్యేమో! జనతా వెళ్ళి అరగంటయిందిగా!" అంది శ్రీమతి.

"అన్నయ్యే అయితే తలుపు బాదే ఖర్మేం? పిలవనే పిలుచునే."

"మరి పోస్టుమాన్ అయితే మాత్రం పిలవాలా ఏం! తలుపుసందులోంచి ఉత్తరాలు గిరాటెయ్యొచ్చుగా!"

"మనియార్డరుగానీ ఉందేమో!" అన్నా ఆశగా!

"ఆ! మనియార్డరూ! మట్టిగడ్డలూనూ! ఏదో పుస్తకమే వస్తుంది."

"లేదు వస్తుందిలే ఒకబాపతు"

ఈసారి ఆశగా తనే చేయికడుక్కుని ఎదురుసన్నాహానికి వెళ్ళింది. అతుకుల బొంతలాంటిపంచ; కట్టులో దూర్చినలాల్చీ; ఆపైన లెదర్ బెల్టు; ఆ ముందు ఎండలో ఓమూల చర్మం నలిచేసి ఉక్కకు దుక్క బొంతకోటు; చేతిసంచీతో సహా పెద్దమనుష్యుల్లోని వెంకటేశ్వర్రావ్‌లా అబ్బులు బాబాయ్ ఉరఫ్ లక్ష్మీనృసింహారావ్ దిగబడ్డాడు.

"ఆ! నేను అనుకుంటూనే ఉన్నా అబ్బులుమావగారికి ఆ వచ్చింది" అంది మా ఆవిడ. చిన్నప్పుడు చదివిన మాయాజ్యోతిష్కుడికథ జ్ఞాపకమొచ్చింది. నాలో నేనే నవ్వుకొన్నా. ముందుగా వూహిస్తే మరో అర్ధశేరు జోడించదూ ఆ అన్నపుగిన్నెకు! తెలియకే ఇప్పుడు తన వాటా అవచ్చిన అగంతుకుడికి నైవేద్యం పెట్టి, తను వంటింట్లో రిహార్సల్సు చేయాల్సినఖర్మం పట్టింది. మర్యాదకోసం పలకరింపులయ్యాయి. కానీ నేనుమాత్రం నూరు రూపాయలనోటు పారేసినముఖంతో దిగాలున కూలబడ్డాను. ఆ పెద్దమనిషి సహపంక్తికి వస్తే కాని నేను నా కార్యక్రమాని కుపక్రమించటం జరగదు. ఇల్లాంటి పట్టింపులు గ్రహించలేని కుర్రాళ్లుమాత్రం ఆ వేయించిన వంకాయముక్కల్ని వాళ్లమ్మ ఎంత జాగ్రత్తగా విదుపుతున్నా వన్సుమోర్ కొట్టేస్తున్నారు. శ్రీమతికి వళ్లు మండిపోతోంది. వంటింటి తలుపు ప్రక్కనుండి కుర్రాళ్ళకేసి గుర్రుమని చూస్తోంది. నాకేసి చూస్తూ నేత్రావధానం చేస్తోంది.

"త్వరగా లెండ్రా అబ్బులు తాతయ్య జీడిపప్పు తెచ్చాడు" అన్నా. నోరుజారి అన్నానో లేదో అపళంగా కుర్రవెధవలిద్దరూ కంచాల్లో ఏముందో చూడకుండానే చేతులు కడిగేసి, జిడ్డుచేతులు పాత్రి లాగులకి తుడిచేసుకుంటూ అబ్బులు తాతయ్యదగ్గరకు ఒక్క ఉదుటున వ్రాలారు. వాళ్ళమ్మకి మాత్రం డిసిప్లిన్ కావాలి. "ఆ జిడ్డుచేతులు చింకితుండుగుడ్డకే తుడవాలి" అని ఆమె ఆజ్ఞ. ఆత్రుతతో అదికాస్తా ఉల్లంఘించేశారు. "వెధవల్లారా! ఇల్లారండి" అంది; పళ్ళు కొరుకుతూ.

"ఉండవే తాతయ్యగారు జీడిపప్పు ఇస్తారు" అంటూ వాళ్ళస్సలు కదలలేదు - అదీ నా అదృష్టమే అనాలి - పిలిచి ఆవిడిచ్చే చెవినులుపుటు - వాళ్లగోల లిప్తమాత్రంలో తప్పి మర్యాద నిలబడ్డందుకు. చివరికి బాబాయ్ పర్మిషన్‌మీద నా భోజనం పూర్తయింది.

"బాబాయ్! భోజనానికి లే" అన్నాను.

"భోజనానికా నేవస్త!" అంటూ చతికిలపడి చంటివాడిలా ఏడుస్తూంటే, కుర్రాళ్లు కూడా భా! మన్నారు. ఆ ఏడుపులో కుర్రకుంకలికి జీడిపప్పు గుర్రాలు అంగుటి కడ్డంగా పడవుకదా అన్న ఆవేదన, అస్సలు అబ్బులు బాబాయ్ ఏడుపుకి కారణం అంతుచిక్కక ఆందోళన మితిమీరింది. చివరికి నలుగురూ చేరారు. ఈఫార్సుఅంతా వింటూ తనకేమీ సంబంధం లేనట్టు పట్టించుకోకుండా చలించనిశిలలా చుట్ట కాల్చుకుంటూ వీధిలో కూర్చున్న ఆసామీ - బాబాయ్‌కి సహాయకారిగా వాళ్ల వూరునుండి వచ్చిన స్నేహితుడు చెప్పాడు ఇట్లా—"నేను బాబుగారింటికి నిన్న ఉదయం వెళ్లాను. వెళ్ళేసరికి ఒంటిపై స్పృహ లేకుండా జ్వరంతో పడి మూలుగుతున్నారు. మధ్యమధ్య ఏదో పరాకు మాటలు దొర్లిస్తున్నారు - తలదగ్గిర చిందరవందరగా ఈ స్టాంపులన్నీ చెదిరిఉన్నాయ్. అవన్నీ కట్టకట్టి ఈ సంచీలో వేసి పట్టుకున్నా. తలుపులు బార్లా తెరచిఉన్నాయ్. గొంతుక ఎండినా గ్లాసెడు మంచినీళ్లుపోసే దిక్కు లేదు. అసలు అక్కడింకా ఈయన వుంటే హఠాత్తుగా పోతే ఆస్తి అన్యాక్రాంతం అవుతుందని ఆలోచించి ఈరోజు ఇట్లా తీసుకొచ్చేశాను. నిన్న డాక్టరుగారిని తీసుకొచ్చి చూపిస్తే ప్రాణాపాయం ఏమీ లేదని చెప్పి ఇంజక్షను ఇచ్చారు. ఉష్ణతాపంవల్ల వచ్చిన శోష అన్నారు. సరియైన విశ్రాంతి ఇస్తే చాలని చెప్పారు. ఈ ఉదయానికి కాస్త నెమ్మదిగా ఉంటే ఇక్కడకు తీసుకొచ్చేశాను" అన్నాడు.

"దిక్కులేనివాణ్ణి - వంశానికొక్కడవ్ - నీ చేతిమీదుగా ఈ ప్రాణంపోతేనే మనశ్శాంతి" అంటూ భవిష్యత్తును తలచుకొని బాబాయ్ ఏడుస్తూంటే నాకు చాలా జాలి వేసింది.

"తనకు దిక్కులేక కాదు - ఉన్నారు. తన ఆస్తిని ప్రేమించి తనకు ఆశలు కల్పించి గాలిమేడలు కట్టేవారు పుట్టెడు బలగం ఉంది. ఎవర్నీ నమ్మలేకపోతున్నాడు. వయస్సా అరవై దాటింది. దినదినానికీ శక్తి అడుగంటిపోతోంది. చచ్చేవరకూ చాకిరీ చేస్తేకాని జరగని పరిస్థితిలో తనున్నాడు— ఆస్తికి వారసులున్నారు. నిజంగా అభిమానించేవారసలేలేరు. శక్తి లేదుకదా నౌఖరీ మానేసి మూలధనం మూడువేల రూపాయల్ని ఖర్చుపెట్టుకొని బతకూడదూ అన్నారు కొంతమంది. అలా చేస్తే మూడు సంవత్సరాలకి చెల్లు. తనదగ్గ డబ్బున్నా తన్ని హీనంగాచూసే బంధువర్గం, ఆకాస్తా చెల్లగొట్టేస్తే రేపు విక్రిమికీటకాదులకు మల్లేనో చూడరన్న నిశ్చయమేదీ? మా బాబాయ్‌గారు వస్తూవస్తూ దార్లో తహసీల్దార్ గార్ని కలుసుకొని ఈరోజే తన యావదాస్తీ, అనగా మూలధనం మూడు వేల రూపాయలను, తన తదనంతరం తనకే

# ★ కుక్కతోక ★

ఉంచేటట్లు ఏర్పాటుచేశారు. మీరైనా ఇచ్చట ఊరికే కూర్చోలేదు - ఈమాత్రం అక్కడ కష్టపడితే వంశ పారంపర్యా వచ్చే వృత్తి పరహస్తం గాకుండా, మీరు నిర్వహించినట్టూ ఉంటుంది; ఆయన్ని అవసాన కాలంలో మీవద్దనే ఉంచి పోషించినట్లూ ఉంటుంది. కాబట్టి యోచించండి. ఉద్యోగానికి రాజీనామా ఇవ్వాల్సొస్తుంది. మా కందులో దొరికే పైసా దీనికి చేర్చితే నెలకు ఓ నూరురూపాయలకు లోటుండదు. ఎక్కడైనా నౌఖరీయే గానీ, తలవంచి బుర్రముక్కోన్న చేసే నౌఖరీ అది - ఇది స్వంతవృత్తి - బాగా ఆలోచించండి బాబు గారు" అన్నాడు ఆ పెద్దమనిషి.

"సరే ఎలా అయితేనేం ఆయన కావిధమైన మనుకారం ఉన్నప్పుడు నువ్వు నౌఖరీ మానేయక్కరలేదు. ఆ మూడు వేల రూపాయలు పట్టుకొని నీవద్దకు వచ్చేస్తే వారి బాధ్యతంతా నీవే చూసుకుంటావుగా! దానికంత బాధ ఎందుకూ" అన్నారు నా మిత్రులు.

"అయ్యో! అందరికీ ఎలా యిష్టమైతే అలానే చేయొచ్చు - నా ఆశయం ఏమిటంటే కష్టపడి కట్టిన కొంపా; జాగా వసులుకొని ఈ అద్దె ఇళ్ళల్లో, ఈ ఇరుకు సందుల్లో ఈ పట్టణాల్లో కాపురం నాకిష్టంలేదు. ఏదో నాఅండని వాడుంటే డబ్బుపట్టుకొని ఒకరిదగ్గర కెళ్ళే ఉద్దేశ్యం నాకు లేదు" అన్నాడు బాబాయ్—

చివరికి బాబాయ్ తన ఉద్యోగమిప్పించి అజమాయిషీ చేయాలన్న ఉబలాటం వ్యక్తీకరించాడు. తనూ తన డబ్బుతో ఒకరి ఆశ్రయంలో ఉండటానికి ఆయన మనస్సు నిరాకరించింది—

బాబాయ్ మాత్రం కాస్త జావత్రాగి శరీరాన్ని కుర్చీలో చేరవేసి నేను కాస్త ఆలోచించుకోటానికి అవకాశం యిచ్చాడు. చాలాకాలంనుంచి అస్సలు రాకపోకలు లేవు. స్వయంగా వచ్చి ఆస్తి చూపించి ఇస్తానంటుంటే అనుమానించటం మానవలక్షణం కాదని నాకు తోచింది. బాబాయ్‌కన్నా నా శ్రేయస్సు పట్టించుకొనేవా రెవరుంటారు - ఆయనకు మాత్రం నన్ను ద్రోహంచేస్తే కలిసివచ్చే దేముంది? వివిధమైన యోచనలతో బుర్ర వేడెక్కిపోయింది. ఠంగ్ ఠంగ్న గడియారం రెండు కొట్టింది. ఉద్యోగపు వేషంవేసి ఆఫీస్‌కు బయలుదేరాను.

* * *

ఇంటి కొచ్చేసరికి రాత్రి ఏడు గంటలైంది. బాబాయ్, ఆయన స్నేహితుడూ రాయ్‌పూర్ ట్రయిన్‌కు వెళిపోయారు— తిరిగీ ఎల్లుండి వస్తామన్నారన్న వార్త మా శ్రీమతి చెప్పింది.

"అయ్యో అట్లాగా! అంత తొందపడ్డాడేం! జ్వరం కదా అని బత్తాయ్ పళ్ళు తెచ్చానే" అన్నా.

నాకు ఆఫీసులో పని చేతబట్టలేదు — ఎంతచేసినా సంతృప్తిలేని ఈ చాకిరీకి అంతు కనిపించినందుకు చాలా సంతోషించాను. నాపై నూది మొన పాటి అభిమానం కల ప్రతివారూ బాబాయ్‌కి ఎదురు తిరగొద్దు అని సలహా ఇచ్చారు. ఈ ఉద్యోగానికి మహా ఇస్తే నూరు రూపాయలిస్తారు. రోజుకి ఎనిమిదిగంటలు చాకిరీ. దానికైతే ఈజీచైర్‌లో కూర్చుని స్టాంప్‌లమీద సంతకాలెడితేచాలు—మహా అయితే రెండు రోజులకొకమారు పట్నంవెళ్లాలి. స్టాంప్‌లు కొనటానిక్కి—ఏదో సినిమాలకు అలవాటు పడ్డ జీవితాలు కనుక ఆపనీ ఈపనీ ఒక్కసారే చేయొచ్చు—ఇట్లా గాలి మేడలుకడుతున్నా!

రెండు రోజులైంది. అనుకున్న ప్రకారం అబ్బులు బాబాయ్ వచ్చాడు. ఈసారి మాయింటిల్లి పాదికీ బట్టలు మోసుకొచ్చాడు. సుమారు రెండు వందల రూపాయలుంటయ్ వెర్రి ఆపేక్ష అనుకున్నాం — ఈ సారి పీఠాధిపతియైన స్వాముల వారికి చేసినట్టు సేవ చేసింది మా శ్రీమతి.

బాబాయ్ వీలుచూచి నత ఉద్యోగపు కిటుకులన్నీ ఇంజకు చేస్తున్నాడు. తన మూడు వేలకీ నా ప్రావిడెంటు ఫండ్ బాపతు వగైరా సుమారు వెయ్యి జతచేస్తే నాలుగు వేలవుతాయనీ, కాపిటల్ ఎంత ఉంటే, కమీషనంత పెరుగుతుందనీ చెప్పాడు. లంచాలు ఎందుకివ్వాలో — ఎవరెవరికివ్వాలో అవి యివ్వకపోతే వచ్చే సాధకబాధకాలూ వివరంగా చెప్పి, ఆ పుచ్చుకునే వారిపై నాకు సానుభూతి కలిగేలా వప్పించాడు.

సాధారణ సంసారులు లేనిపోని పోకిళ్ళకు పోయి సంసారాలు లంకాదహనం చేస్తున్నందుకు కసిగా గర్జిస్తూ; నన్నుకూడా వాళ్లలో చేర్చాడు—ఖర్చు వీలయినంత మటుకు తగ్గించుకోటం నేర్చుకోవాలన్నాడు. ఇంట్లో ఆడపెత్తనంవల్ల సంసారాలు చితికి పోతున్నాయనీ; మా ఆవిడ వంట పనిచేస్తున్నా ఆ ఖరీదైన చీరలు వాడకం ఎందుకనీ; మూడు పూటలు కాఫీలు వాట్టం ఏమంత మంచిదికాదనీ, కుర్రాళ్లకి డబ్బులివ్వటం హానికరమనీ; వచ్చిన ప్రతి ఫిల్మ్‌కూ పిల్లలతో సహా బయలు దేరటం వాళ్ళని మొక్కప్పుడే వంచకపోవటమనీ— ఏవో ఇల్లాంటివి; సవాలక్ష చెప్పాడు. వాస్తవానికి అన్నీ మన్నించదగ్గవే గానీ ఆచరణ యోగ్యంగా మాత్రం లేవు. ధని వృత్తు బాగా ఆలోచించుకొన్న మీదట బాబాయ్ ప్రోద్బలంపైన రాజీనామా పత్రాన్ని వ్రాశాను. వ్రాసేటప్పుడు వేడి కన్నీటి చుక్కలు టప్‌న రాలి అక్షరాలు అలుక్కుపోయాయి. పదిహేను సంవత్సరాలయి ఈ వాతావరణాన్నంటిపెట్టుకున్న నేను నేడు అయాచితంగా వచ్చే ఆస్తి కోసం ఉన్న ఉద్యోగాన్ని కాలదన్ని,

పరాయి ఊరు పరుగులెత్తడంలో; పప్పులో కాలేసేనేమో అనిపించడం; ప్రారంభించింది. ఎడం కన్ను కూడా అదిరింది—

"ఇంట్లో పురిటి సమయం. ఓ వంద రూపాయలుండాలి చిల్లర బాకీలు వగైరాలకూ—బాబాయ్! నువ్ బదులు ఇయ్యి. నా సొమ్ము రాగానే ఇచ్చేస్తాను" అన్నాను.

బదులుమాట వినగానే బాబాయ్ ముఖం కందగడ్డ అయింది. కొద్దిసెకండ్లు తీవ్రంగా యోచించి "సరే! తప్పకుండా ఇస్తాగానీ, ఒకమాట, ఇంతవరకూ నే జెప్పిన సాధక బాధకాలు నువ్ ఏమీ పట్టించుకున్నట్లు లేదు. సొమ్ము దుబారా చేయటం నాకిష్టం లేదు - కావాలంటే వదో ఇరవైయో తీసుకో - మనలో మనకి బదుళ్ళేమిటి?"

"అది కాదు సంసారం ఇచ్చటనుండి కదల్చాల్సివస్తే ఒకవంద కనీసం అవసరం - అది తప్పదు. నాడబ్బు అనుకున్ననాటికి రాదు ఏమంటావ్?" అన్నాను.

"ఊఁ సరే ప్రస్తుతం పైసా హాజరుగా లేదు. వీలు చూసి అక్కడకురా - పట్టుకెళ్ళు" అన్నాడు. సరే అన్నాను.

అర్ధరాత్రి బాబాయ్ వెళ్ళాడు.

*  *  *

టిక్కట్టు తీసుకొని ప్లాట్ ఫారంమీద పచార్లు చేస్తున్నా. పొగలు గ్రక్కుతూ రాయ్‌పూర్ బండి విజయనగరంప్లాట్ ఫారంమీద ఆగిందేతడవుగా జనం ఈగల్లా మూగారు. హడావిడి తగ్గగానే కంపార్టుమెంటులో కూర్చుని అబ్బులుబాబాయ్‌నీ - నూరురూపాయల్నీ తలచుకున్నా. స్టేషను రాగానే బండి దిగి రైలుకట్ట ప్రక్కనుండి నడచి బాబాయ్ ఇంటికి చేరాను - తీరా చూస్తే కప్పతాళం వేసిఉంది. ఇరుగూ పొరుగూ ఇళ్లు ఏమీలేవు, వాకబు చేయటానికి - అతనుండే పరిసరాలు అన్నీ తిరిగి వాకబుచేశా. చివరికి మా తాతగారినుండీ మమ్మల్నందరినీ ఎరిగిన ఓ పెద్దమనిషిని దర్శించా - కూర్చోమని కుశలప్రశ్నలు వేస్తోంటే నాకు చిరాకేసింది, బాబాయ్ సంగతి తేల్చరేం అని. కొంతసేపయాక

సినిమాహాలు గేటు కీపరు: మీరు చాలా ఆలస్యంగా వచ్చారు. ఆట మొదలుపెట్టి చాలా సేపయింది.

ఆలస్యంగావచ్చిన పెద్దమనిషి: ఫర్వాలేదు. నువ్వు గేటు తెరువు. నేను గోల చేయకుండా లోపలికి పోతాను.

గేటుకీపరు: ఆహా! అక్కర్లేదు. నేను గేటు తెరిచానంటే వెంటనే ప్రేక్షకులంతా బయటికి పోతారు.

—పాతూరి సీతారామాంజనేయులు, మద్రాసు.

హోటలునుండి క్యారియర్ తెప్పించారు. వద్దని ఎంత బలవంతంచేసినా వినలేదు. ప్రస్తుతం ఇది తృణీకరిస్తే రాత్రి ఏడు గంటలకే భోజనం అన్నారు - అబ్బే నేనూ! బాబాయ్‌కలిసి భోంచేస్తాంఅని తప్పుకున్నా. ఆయన "హేళనగా నవ్వి! "హా! బాబాయ్! మక్కటోక పట్టుకొని గోదావరి



ఊరిబైట బావి

ఫోటో: వి. రవీంద్రనాథ్; గుంటూరు.

## ★ ముక్తాలోక ★

ఊడినట్టు — బాబాయ్‌కోసం కాకుంటే" అన్నారు. "శాంతించు నాయనా! ఏం ఫర్వాలేదు. తరువాత మాట్లాడుదాం" అన్నారు.

భోజనాలయ్యాక గదిలో కూర్చున్నాం. "కొంచ రెస్ట్ తీసుకోండి. మళ్ళీ వస్తా"నని ఆయన వెళ్ళేరు. నాకు నిజంగా తలకాయ [illegible] తిరిగిపోయింది. అబ్బులు బాబాయ్‌ని అంతగా అసహ్యించుకుంటూ నాకు మర్యాదచేయటంలోగల భావం బోధపడలేదు. ఆలోచిస్తూ అలా చేరబడ్డాను.

* * *

మధ్యాహ్నం మూడుగంటలయింది. లేచి ముఖం కడుక్కొని తల దువ్వుకొని; కాఫీలయ్యాక ఆయన వచ్చి కూర్చున్నారు. "[illegible] జరి - పరిస్థితి అ పైవారివల్ల మీరు తెలుసుకుంటారు. ఆయన ప్రస్తుతం ఊళ్ళో లేడు. నాలుగురోజు లవుతుంది వచ్చేసరికి." అన్నారు. తరువాత మళ్ళీ "మీరు నూరురూపాయ లడిగారటగా?" అన్నారు.

"అవును" అన్నాను. "మీకెట్లా తెలిసింది?"

"ప్రతివిషయం తెల్సు — మీరు రిజైన్ చేసేశారా?"

నేను ఆత్రుతగా ఆయనముఖంలోకి చూస్తూ "ఊఁ" అన్నా.

ఆయన "ప్చ్" అన్నారు. "ఏమైనా అవకాశముంటే అధికార్ల కాళ్ళు పట్టుకొనైనా ఆఉద్యోగం నిలబెట్టుకోండి ఇది నా సలహా" అన్నారు.

ఆయనలేచి కండువా సవరించుకొని "అలా వస్తారా! కొంచెం చల్లగాలికి తిరిగొద్దాం" అన్నారు. సరేనని బయలుదేరాను.

ఆయనముందూ; నేను వెనకా నడిచాం. మౌనంగా రైలుకట్టప్రక్కనుండీ ఆయన చాలా నిదానంగా అడుగులు వేస్తున్నారు.

"మాస్టండీ, నాకిదంతా అగమ్యగోచరంగా ఉంది. ఎటూ నిర్ణయించుకోలేని జటిల సమస్యతో కొట్టుకుంటున్నా" అని బాబాయ్ మొదటిసారివచ్చింది లగాయతు నేటివరకూ జరిగినదంతా వివరించాను— ఇద్దరం పొలం గట్టుమీద కూర్చున్నాం. గాలి తెరలు కందువా సెగరకొడుతున్నాయ్.

ప్రశాంతమైన చూపులతో నాకేసి చూస్తూ ఇలా అన్నారు.

"నాయనా, చూడూ! ఈనాడు కాదు, మీ తండ్రితాతలనుండీ మీకుటుంబం మాకుటుంబం ఒక్కటిగా మెలిగింది. మీరు పెద్దవాళ్ళయ్యాక ఈవూరు విడిచి వెళ్ళారు. ఈవూరు నాటికీ నేటికీ చాలా మారిపోయింది. పార్టీలుకక్షలూ - పదవీవ్యామో

ఇంటిముఖం

ఫొటో. ఆర్. కృష్ణారావు; మైలవరం,

రోలు ఎక్కువయ్యాయి. నేనంతా విన్నాను. మా బాబాయ్ అక్కగారికి ఏదో యిస్తా వారింట్లో నే భోంచేస్తాం జేవాడు. ఆమెకూ కాలం మళ్లింది. ఈయన అభిరుచిని బట్టి ఆమె వండలేదు. ఈయన ఆ మూరుమూల కొంపలో వంట ప్రారంభించాడు - మేనల్లుడితో కొన్ని వ్యవహారాలపట్ల వైషమ్యం పెంచుకున్నాడు. బాగా వున్నరోజుల్లో తన మేనల్లుడి కూతురికి వెయ్యిరూపాయలు కట్నం క్రింద ఇస్తానన్నాడు. మేనల్లుడు అడపాదడపా చేబదులు క్రింద ఓ వెయ్యి రూపాయలు తీసుకొన్నాడు. 'మావయ్యా నువ్ ఎట్లానూ అమ్మాయికి వెయ్యిరూపాలు ఇవ్వదలచుకొన్నావ్ కాబట్టి నా బాకీ రద్దు చేసుకో' అన్నాడు. దాంతో ముసిలాడు తారాపథానికి లేచి; ఊళ్లో అందరితో చెప్పి అల్లరిచేశాడు. ఇద్దరూ కలియబడ్డారు — వారిమీద కసికొద్దీ మాకు ఏదో ముట్టచెప్పి ఆశపెట్టి ఇచ్చట కాపురం పెట్టించాలన్నాడు ఈ అపరచాణుక్యుడు. మళ్లీ నిన్న నే మేనల్లుడువచ్చి 'మావయ్యా; ఏదో బుద్ధి పొరపాటయింది — మాటలు జారాయి నువ్ పెద్దదిక్కు. నీవు స్వయంగావచ్చి నడ్డి గట్టుకొని అమ్మాయికి మూడు ముళ్లూ వేయించక తప్ప'దని చేతులు పట్టుకొంటే. రబ్బరుబంతిలా ఉబ్బిపోయి; పెళ్లి ఖర్చులకి ఒక వెయ్యి పెడుతూ ఒక వెయ్యి రూపాయలు కట్నం పెడుతూ సిద్ధమయ్యాడు. ఇంక మిగిలేది వెయ్యి. అంతో తన డబ్బుదాచి ఆశపడేవారే కాని తనపైన ప్రేమలేదనీ, అనుపలో నే పెదుగనీ, మీరూ వందరూపాయలడిగారనీ, ఇంక అందరికీ బదుళ్లు ఇచ్చేస్తే తను బ్రతికేది లేదంటూ — ఆ వెయ్యిరూపాయలూ తన ఒక్క పొట్టకీ చాలనీ ఇవ్వాళే పెళ్లికి వెళ్లాడు" అన్నారు.

పుక్కతోక పట్టుకుని గోదావరి యీదినట్లయింది నా పరిస్థితి. కూర్చున్న స్థలం అరడుగుల లోతుకు కుదించుకుపోయినట్లు అయింది. "ఇంకా దరఖాస్తు యజమానులకందజేయలేదు — సెలవులవటంవల్ల. సోమవారం ఇద్దామనుకుంటున్నా — ఇందులో ఇంత అపూర్వముందని నాకేం తెల్సు —" అన్నా —

"మంచిపని చేశావ్ నాయనా!" అన్నారు.

స్టేషన్లో గంట గణగణమని వినిపించింది. ఎవరో నా కర్తవ్యాన్ని జ్ఞాపకం చేసినట్లయింది. "అబ్బులు బాబాయ్ వంద ఇస్తే అందులో వాడుకోవచ్చని అర్ధరూపాయతో వచ్చేశా — ఒక్క అర్ధరూపాయి ఇప్పించండి — సత్వరగా ఇంటికి పోవాలి" అని సానకబాం కౌలు వివరించా — నన్నేం నిర్బంధించలేదు — "చిల్లర లేదు. ఇది ఉంచు" అంటూ పదిరూపాయలనోటు నా చేతిలో ఉంచారు.

స్టేషన్ వేపు పరిగెత్తాను — నేనెక్కేరైలు ఆయన్ని దాటుకుని పరుగెడుతూంటే కృతజ్ఞతతో "వెళ్తున్నాను" అన్నా ఆయన కేసి చూస్తూ.








## విడాకులు:

కొమ్మూరి ఉషారాణి

విడాకుల చట్టం అమలులోకి వస్తుందనగానే - అందులోనూ పరస్పరాంగీకారంతో విడాకులు పుచ్చుకునే అవకాశం ఆ చట్టంలో కల్పించబడిందనగానే, దేశం నాలుగు మూలలా వాదోపవాదాలు చెలరేగాయి. కాపురాలు చేస్తున్న భార్యాభర్తలందరూ విడాకుల అర్జీలతో కోర్టువద్ద హాజరు కావాలని ప్రభుత్వం ఆజ్ఞ ఇచ్చారేమో నన్నంత అలజడి జరగటం ఆశ్చర్యంగానే వుంది. కారణాలతో నిమిత్తం లేకుండా పరస్పరం అంగీకరించుకుని విడాకులు పుచ్చుకోవటం అంటూ జరిగితే, ఇంక సమాజంలో అవినీతి హెచ్చు పెరిగిపోయి హిందూ సంప్రదాయాలూ ఆచారాలు మంటగలిసిపోతాయనీ, ప్రేమ పెళ్లిళ్లకోసం ఆరాటపడుతున్న నేటి యువతీయువకులే ఈ విడాకుల చట్టాన్ని కోరటం సమంజసంగా లేదనీ ఈమాదిరిగా కొందరు వాదించటం హాస్యాస్పదంగా వుంది.

ప్రస్తుత సాంఘికపరిస్థితుల్ని వాస్తవిక దృష్టితో పరిశీలించి ఈ సమస్య ఏ తరహా వ్యక్తులకు చెందుతుందో నిర్ధారణ చేసుకోవాలి. కూలీనాలీ చేసుకునే పాటకపు ప్రజలు సంసారాలలో కలతలూ, మనస్పర్థలూ వస్తే [illegible] ుంటానే పరిష్కరించుకుంటారు. ధనికవర్గానికి చెందిన స్త్రీపురుషులకి ఆస్తిహక్కులు పిల్లలపోషణ, మనోవర్తి మొదలైన సమస్యలు ముఖ్యం. వాటినిబట్టే విడాకుల చట్టం అవసరాన్ని వారు నిర్ణయించుకుంటారు. పోతే విడాకులనేవి సమస్యగా పరిణమించేది సామాన్యమైన కుటుంబీకులకే.

పూర్వం కూడా మనదేశంలో భార్యాభర్తలు కొన్ని పరిస్థితులలో విడిపోవటానికి అవకాశాలు కల్పించబడ్డాయి. కాని స్త్రీకి మళ్ళీ వివాహం చేసుకునే అవకాశం మటుకు వుండేదికాదు. (ఎప్పుడో పురాతన కాలంలో మళ్ళీ వివాహం చేసుకునే అవకాశం కూడా ఉండేది) భర్తతో కాపురం చెయ్యటం దుస్సాధ్యమని భార్య ఋజువు చేయగలిగినపుడు ఆమె విడిగా వుండటానికి, మనోవర్తికి కోర్టుఅనుమతి ఇస్తుంది. 'దాంపత్యహక్కులు' అనేసిద్ధాంతం ప్రకారం భర్తకి భార్యపై సర్వాధికారాలు ఉన్నాయి. కోర్టు వారంటులో భార్య ఎక్కడున్నా తెచ్చుకునేఅవకాశం వుంది.

మనదేశంలో హిందూ సమాజంలో స్త్రీలకు ఉచితమైన స్థానం లభించాలంటే స్త్రీ పురుషులిద్దరికీ సమానహక్కు లుండాలనీ, రాజకీయ సాంఘిక జీవితంలో స్త్రీలూ పాల్గొనాలనీ అనేక సంస్కరణలు బయలుదేరాయి. మన క్రొత్త రాజ్యాంగంలోకూడా స్త్రీలకు పురుషులతో అన్నివిధాలా సమాన హక్కు లివ్వబడ్డాయి. ఇరవయ్యేళ్లకిందటి భారతీయ యువతికీ నేటి భారతీయ యువతికీ ఎంతో తేడా వుంది. 1951 వ సం॥ లో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ప్రవేశపెట్టిన బహుభార్యాత్వనిషేధమూ - విడాకుల చట్టం కొన్ని విపరీతపరిస్థితుల్లో విడాకులకి అవకాశం కల్పించింది.

హిందువులమతంలో వివాహమనేది స్త్రీపురుషుల మధ్య ఒక పవిత్రబంధం. ఈ భావాన్ని తరతరాలుగా మన సమాజం గౌరవిస్తూ వచ్చింది. వీరేశలింగం పంతులుగారు వితంతువివాహాలు చెయ్యాలనే సంస్కరణ తెచ్చినా నేటికీ అనేక కుటుంబాలవారు వితంతువివాహాలమాట తలపెట్టకపోవటానికి కారణం ఈ నమ్మకమే. కాళేశ్వరరావుగారిచట్టాన్ని పురస్కరించుకుని ఎంతమంది విడాకులు పుచ్చుకున్నారు అన్నది అనుమానాస్పదమే. కనుక ఈ బిల్లు అమలు జరగానే హిందూ యువతీయువకులంతా దీనికి



గుట్టిగా మందగా ఎగబడతారనుకోవటం పొరబాటు.

నేటి మన సంస్కారం, సాంఘిక పరిస్థితులలో స్త్రీవిద్య, వితంతువివాహం మొదలైనసంస్కరణల కుదిరికొకుండా, విడాకుల వల్ల స్త్రీలకి కొత్త చిక్కులు వస్తాయని కొందరి వాదం. ఇది పూర్తిగా కాదనలేము. పాశ్చాత్యదేశాలలో విడాకులు పుచ్చుకున్న స్త్రీలు తిరిగి వివాహం చేసుకోవటానికి అక్కడి పరిస్థితులూ, వారి ఆచారాలు అడ్డుపడవు. మన దేశంలో చదువుకున్న స్త్రీలసంఖ్య తక్కువ. అందులో ఆర్థిక స్వాతంత్ర్యమున్న వారి సంఖ్య మరీతక్కువ. ఇటువంటి పరిస్థితిలో విడాకులు పొందిన స్త్రీ కొత్త చిక్కులని ఎదుర్కొన వలసిన మాట నిజమే. కాని ఇటువంటి చిక్కుల్లో స్త్రీల సంరక్షణకోసం అవసరమైన సదుపాయాలు శాసనంలో కల్పించబడాలేకాని, స్త్రీల క్షేమంకోసమే విడాకులు ప్రవేశ పెట్టకూడదనటం సమంజసం కాదు. ఒక పురుషుడితో కొన్ని కారణాల వల్ల కాపురం చెయ్యటం అసాధ్యమని నిర్ణయించుకున్న తరువాత, ఆర్థిక స్తోమత లేని కారణం చూపి ఆమెను అతనితోనే కాపురం చెయ్యాలనటం అన్యాయం. ఆత్మగౌరవమున్న స్త్రీలు అటువంటి హీన పరిస్థితి నుండి బైట పడాలంటే ముందు విద్య, వృత్తులు మొదలైన వాటిని సాధించాలి. అప్పుడుగానీ మన సాంఘిక జీవితంలో మార్పు రాదు.

విడాకులు పుచ్చుకున్న స్త్రీలని మళ్ళీ ఎవరూ వివాహం చేసుకోరంటారుకొందరు. ఇది ఒక స్త్రీలకుమాత్రమే సంబంధించిన సమస్య కాదు. పెళ్ళయి భార్యకు విడాకులిచ్చిన పురుషుడికి తమ కూతుర్నిచ్చి వివాహం చెయ్యటానికి తల్లితండ్రులెంత భయపడతారో, స్త్రీలను జూచి అంతే భయపడటానికవకాశముంది. విడాకులు పుచ్చుకున్నంతమాత్రాన తప్పు చేశారనే నిందను మన సమాజం స్త్రీ పురుషులమీద విధించేటట్లయితే, అది పురుషుల విషయంలో ఒకటీ స్త్రీల విషయంలో ఒకటీ ఎన్నటికీ కాదు. విడాకులు పుచ్చుకున్న పురుషుడికి మళ్ళీ వివాహం జరగటం సులభమనుకుంటూ, స్త్రీని మటుకు నీచంగా చూడక సామాన్యమైన స్త్రీకి యివ్వవలసిన గౌరవము యిచ్చి ఆమెను కాపాడే బాధ్యత, ధర్మమూ సంస్కారమున్న ప్రతి వ్యక్తిమీదా వుంది.

విడాకులసమస్య ఒక్క స్త్రీపురుషుల జీవితానికి సంబంధించినది మాత్రమే కాదు; పిల్లల భవిష్యత్తు కూడా దీనిమీద ఆధారపడి వుంటుంది. భార్యాభర్తలిద్దరిమధ్యా అనురాగం, గౌరవం నశించి, భర్త యితర స్త్రీలతో విలాసాలు గడిపీ, భార్య భర్తని తిరుమా ఎదిరించీ, సంసారంలో అనుమానాలూ కలతలు ఎక్కువయ్యే పరిస్థితులు సంభవించినప్పుడు, ఇంక ఆ యింట్లో పిల్లలకి సక్రమమైన శిక్షణ లభిస్తుందనుకోవటం పొరబాటు. దానికంటె విడాకులు పొందిన తండ్రిదగ్గరో తల్లిదగ్గరో శాంతిసౌఖ్యాలు లభించే వాతావరణంలో పెరగటం ఎంతో ఉత్తమమైనది. చట్టరీత్యా భార్యాభర్తలు విడాకులు పొందినా పొందకపోయినా, తల్లితండ్రుల మనఃక్లేశాలవల్ల నరకకూపంగా తయారయ్యే యిళ్ళల్లోని పిల్లల పరిస్థితి దుర్భరంగానే వుంటుంది. ఇటువంటపుడు విడాకులవల్ల కొత్తగా కలుగుతుందనుకోవటము కంటె, చాలామటుకు పిల్లల భవిష్యత్తు బాగుపడుతుందనే అనుకోవాలి.

ఇక పరస్పర అంగీకారంతో విడాకులు పుచ్చుకునే అవకాశం కల్పించటంలో అత్యాచార మేమిటో బోధపడటము లేదు. ఫ్రాన్సు, హంగరీ, జర్మనీలలో పరస్పర అంగీకారంపై విడాకులు పుచ్చుకునే అవకాశం వుంది. పాశ్చాత్యదేశాలలో కూడా విడాకులు పొందటం అంత సులభం కాదు. ఉదాహరణకి సోవియెట్ రష్యాలో ఇప్పుడు విడాకులు పుచ్చుకునేవారి సంఖ్య తక్కువ. చట్టరీత్యా విడాకులు పుచ్చుకునే అవకాశమున్నా, ఆచరణలో విడాకులు లభించటం సులువుకాకుండా చేశారు. అన్నివిధాలా విడాకులకి ఎగబడటం శ్రేయోదాయకం కాదనీ, దానివల్ల చిక్కులు కలుగుతాయనీ ప్రచారం చేశారు.

ఈ బిల్లు కేవలం ప్రజలను విడాకులు పుచ్చుకొమ్మని ప్రోత్సహించటానికి ప్రవేశ పెట్టబడిందనుకోవటం, పొరబాటు. భార్యాభర్తలు కలిసి వుండటం దుర్భరమైనప్పుడు, దొంగ సాక్ష్యాలు బనాయించి విడాకులు పుచ్చుకోవటం కంటె, పరస్పరం అంగీకరించుకొని విడిపోవటములో ఎంతో సుఖంవుంది. వారిద్దరూ శాంతి సౌఖ్యాలతో కాపురం చెయ్యగలిగే పరిస్థితులు తారుమారైనప్పుడు విడాకులు పొందే అవకాశం కల్పించడమే ఈ బిల్లుయొక్క ముఖ్యోద్దేశం. ఈ ఏర్పాటు అంధకారంలో మగ్గిపోయే కొందరి స్త్రీలకు వెలుగుచూపిస్తుందనీ, మన సాంఘిక పరిణామంలో ఈబిల్లుని ప్రవేశ పెట్టడం ఒకడుగు ముందుకు వెయ్యటమే గాని వెనుకంజ కాదనీ ఒప్పుకోక తప్పదు. మనం ఎదుర్కొనే కొన్ని కష్టాలకు కర్మఫల మొక్కటే కారణం కాదనీ, అటువంటి పొరబాట్లని సరిదిద్దుకునే అవకాశం కల్పించడమే ఈ బిల్లుయొక్క ఆశయమనీ గ్రహించగలిగిన నాడు ఈ శాసనాన్ని హర్షించగలం.



# పలుకు బంగారం

పెళ్లైన కొత్తరోజులవి. దసరాలకు అల్లుడుగారిని రప్పించారు. ఆయన తత్వం ఇంకా ఎవరికీ అంతగా బోధ పడలేదు. ఆయన వచ్చారన్నమాటేగాని మా వాళ్లతో ఏమైనా మాట్లాడితేగా? బెల్లం కొట్టినరాయిలా కూర్చునేవారు. అక్కడికీ మావాళ్లు పలకరించి చూశారు. ఊ - హు - పలికితేగా! మావాళ్లతో మాట్లాడటం సిగ్గో? లేక అయిష్టమో. ఏదీ తెలియదాయెను! మొహం ఎప్పుడూ అదోలా పెట్టుకుని వుండేవారు. ఆయనతత్వంచూసి నాతో సరిగా కాపరం చేస్తారో చెయ్యరో అని మా పెద్దమ్మ బెంగ.

ఆయన లేకుండా చూసి మావాళ్లంతా ఒకటే గుసగుసలు మొదలెట్టారు. పొరుగింటి పుల్లమ్మ ఇరుగింటి వెంకమ్మకూడా మావారి తత్వానికి విస్తుబోతూ "మాకు డబ్భయ్యేళ్లు పదిదాటిందిగాని, ఇల్లాంటి అల్లుళ్ళను ఎక్కడా చూడలేదే అమ్మా" అంటూ మా అమ్మదగ్గర ప్రారంభించారు. నాకు వళ్లు మండిపోయింది. వూళ్లోకికూడా ఈవిషయం ప్రాకింది. నీళ్లబావులదగ్గర, నీలాటిరేవుల్లోనూ అమ్మలక్కలుచేరి మావార్ని గురించి చెప్పుకుంటూ అందరూ దవడలు నొక్కుకునేవారే!

వాళ్లనుకున్నంత విపరీతం ఆయనలో నాకు కనిపించలేదుకాని, అందరూ విపరీతంగా చెప్పుకుంటూంటేమాత్రం కాబోలు అనుకోక తప్పిందికాదు. లోకులమాటలు వింటూంటే నాకు చాలా అభిమానం వేసేది. అయినా మావారివిషయం వాళ్లకెందుకో? వాళ్ల నోళ్లు కట్టటం ఎలాగా? ఎదురింటి రమణమ్మ మొగుడు వట్టిపోకిరి. ఆడది కనిపిస్తేచాలు వెర్రిచూపులు చూస్తాడు. అల్లాంటి వాణ్ణి అందరూ ఘనంగా చెప్పుకుంటున్నారే! మరి మా ఆయన్ని ఎందుకు చెప్పరు? మాఆయనకూడా ఆడవాళ్లను అల్లా వెర్రిచూపులుచూస్తే ఘనంగా చెప్పుకుంటారేమో ననిపించింది.

ఆ వేళ భోజనాలు అయ్యాక మావాళ్లంతా వాకిట్లో కూర్చుని పిచ్చాపాటీ వేశారు. అప్పుడు మావారు లేరు. నేను గదిలో కూర్చుని ఏమిటో వెర్రిమొర్రి ఆలోచనలు ఆలోచిస్తున్నాను. మా పెద్దమ్మ సన్నసన్నగా కంఠం నొక్కుకుంటూ అన్నమాటలు వినపడ్డాయి. "కొంపదీసి అల్లుడు వెర్రివాడుకాడుగదా? మాటా మంతీ లేకుండా ముంగిలా మూతి ముడుచుకుని కూర్చుంటాడు, పలకరిస్తే పలకడాయెను! అల్లుళ్ళను ఇంతమందిని చూశాంగాని ఇలాటివాణ్ణి ఎక్కడా చూడలేదమ్మా; ఇదేమి చిత్రమో గాని!"

## పి. సూర్యకాంతం

"ఒకవేళ మాట్లాడితే నత్తి వస్తుందేమో అతనికి! అందుచేతే మాట్లాడకుండా వుంటున్నాడు పిన్నీ!" అంటూ మా పెద్దక్క ప్రారంభించింది. అంతలో మా అమ్మమ్మ అటకాయించింది. "అవేమీ కాదర్రా! కార్యం అయితే అన్ని బిడియాలూ వదులుతాయి. చచ్చి స్వర్గాన వున్నారు; మా ఆయన పెళ్లైనకొత్తలో ఇలాగే వుండేవారు. కార్యం అయ్యాక అన్ని తంతులూ తగ్గాయ్" అంది.

"ఏమోనండీ! దాని తలరాత ఎలా వుందో, నేను ఈ సంబంధం వద్దు మొర్రో అని మీ అబ్బాయితో ఎంతో పోరాను. ఆయన వింటేగా? డబ్బున్నవాడని, పిల్ల సుఖపడుతుందని, చూస్తూ చూస్తూ దాని గొంతుక కోశారు. నేనేమన్నా అంటే నామీద చర్రున లేస్తారు. నేనేగా లోకువ! అయినా ఎవరి కర్మకు ఎవరు కర్తలూ" అంది మా అమ్మ.

ఈమాటలు వినేసరికి నాకు ఎంతో అవమానం వచ్చింది. గుండెలు ఝల్లుమన్నాయ్! ఎందుకో ఉడుకుమోతుతనం వచ్చింది. ఆయన ఎదురుగాపోయి నిలదీసి 'మీరు ఇల్లాంటివారనుకోలేదని అడిగేద్దామా అనిపించింది. కానీ కొత్తగా పెళ్లయింది. ఎక్కడైనా మొగుడుతో వాదులాడతారా? అని మళ్లీ సిగ్గుపడ్డా. ఏం చెయ్యటానికీ తోచలేదు. అస్తమానం ఇదేఆలోచన - మావారు ఇంత కర్కశహృదయులైతే వీరితో ఎల్లా కాపరం చేయటం? పెద్ద బెంగపట్టుకుంది.

మా అమ్మా వాళ్లు ఇంకా సోది ఆపలేదు. ఆయన వచ్చేవేళకూడా అయింది. ఆసోది మానమని చెప్పాలనిపించింది. కాని చచ్చేసిగ్గు, ఎల్లా అనను? నేను అనుకున్నట్టే ఆయన వచ్చారు. మావాళ్ళంతా ఎక్కడివాళ్ళక్కడ పికాపికలయ్యారు! అందులోనూ మా అక్కకి ఆయనంటే చెడ్డ సిగ్గు. ఉత్తప్పుడు వాగమంటే నోటికేమీ అడ్డులేదు గానీ వట్టి పిరికిది. చాటునుండి హేళనలు చెయ్యమంటే మాత్రం లెఖ్ఖలేదు.

మావారిమీద చెప్పలేనంత ఆగ్రహం కలిగింది. ఏమైనాసరే, ఆరు మూడైనా మూడు ఆరైనా, ఆరూ మూడూ తొమ్మిదయినా, వారిని 'మీసంగతేమిటు'ని అడిగేయాలనుకున్నాను. అయితే ఎప్పుడడగటం? ఎప్పుడేమిటి? ఎవరూ లేకుండా చూసి ఆయన ఒంటరిగా వుండగా అడిగేద్దామనుకొన్నాను. లేకపోతే అత్తవారితో గాని, కట్టుకున్న పెళ్ళాంతో గాని సరిగా మాట్లాడక ఏమిటి పెంకితనం?

మా వాళ్ళతో మాట్లాడటం ఇష్టం లేకపోతే నాతో మాట్లాడవచ్చుగా? అదేనా లేదే పిచ్చి బ్రాహ్మడికి! అయ్యయ్యో నా ఖర్మంకొద్దీ దొరికారో దేవుడా, అనుకున్నాను.

సాయంత్రం ఆరు గంటలైంది. మావాళ్లు

గుడ్డిగా మందగా ఎగబడతారనుకోవటం పొరబాటు.

నేటి మన సంస్కారం, సాంఘిక పరిస్థితులలో స్త్రీవిద్య, వితంతువివాహం మొదలైన సంస్కరణల హదిరి కాకుండా, విడాకుల వల్ల స్త్రీలకి కొత్త చిక్కులు వస్తాయని కొందరి వాదం. ఇది పూర్తిగా కాదనలేము. పాశ్చాత్యదేశాలలో విడాకులు పుచ్చుకున్న స్త్రీలు తిరిగి వివాహం చేసుకోవటానికి అక్కడి పరిస్థితులూ, వారి ఆచారాలు అడ్డుపడవు. మన దేశంలో చదువుకున్న స్త్రీలసంఖ్య తక్కువ. అందులో ఆర్థిక స్వాతంత్ర్యమున్న వారి సంఖ్య మరీ తక్కువ. ఇటువంటి పరిస్థితిలో విడాకులు పొందిన స్త్రీ కొత్త చిక్కులని ఎదుర్కొన వలసిన మాట నిజమే. కాని ఇటువంటి చిక్కుల్లో స్త్రీల సంరక్షణకోసం అవసరమైన సదుపాయాలు శాసనంలో కల్పించబడాలే కాని, స్త్రీల క్షేమంకోసమే విడాకులు ప్రవేశ పెట్టకూడదనటం సమంజసం కాదు. ఒక పురుషుడితో కొన్ని కారణాల వల్ల కాపురం చెయ్యటం అసాధ్యమని నిర్ణయించుకున్న తరువాత, ఆర్థిక స్తోమతలేని కారణం చూపి ఆమెను అతనితోనే కాపురం చెయ్యాలనటం అన్యాయం. ఆత్మగౌరవమున్న స్త్రీలు అటువంటి హీన పరిస్థితి నుండి బైట పడాలంటే ముందు విద్య, వృత్తులు మొదలైన వాటిని సాధించాలి. అప్పుడుగానీ మన సాంఘిక జీవితంలో మార్పు రాదు.

విడాకులు పుచ్చుకున్న స్త్రీలని మళ్ళీ ఎవరూ వివాహం చేసుకోరంటారు కొందరు. ఇది ఒక స్త్రీలకుమాత్రమే సంబంధించిన సమస్య కాదు. పెళ్ళయి భార్యకు విడాకు లిచ్చిన పురుషుడికి తమ కూతుర్నిచ్చి వివాహం చెయ్యటానికి తల్లితండ్రులెంత భయపడతారో, స్త్రీలను జూచి అంతే భయపడటానికి అవకాశముంది. విడాకులు పుచ్చుకున్నంత మాత్రాన తప్పు చేశారనే నిందను మన సమాజం స్త్రీ పురుషులమీద విధించేట్టయితే, అది పురుషుల విషయంలో ఒకటీ స్త్రీల విషయంలో ఒకటి ఎన్నటికీ కాదు. విడాకులు పుచ్చుకున్న పురుషుడికి మళ్ళీ వివాహం జరగటం సులభమనుకుంటూ, స్త్రీని మటుకు నీచంగా చూడక సామాన్యమైన స్త్రీకి యివ్వవలసిన గౌరవము యిచ్చి ఆమెను కాపాడే బాధ్యత, ధర్మమూ సంస్కారమున్న ప్రతి వ్యక్తిమీదా వుంది.

విడాకులసమస్య ఒక్క స్త్రీపురుషుల జీవితానికి సంబంధించినది మాత్రమే కాదు; పిల్లల భవిష్యత్తు కూడా దీనిమీద ఆధారపడి వుంటుంది. భార్యాభర్తలిద్దరిమధ్యా అనురాగం, గౌరవం నశించి, భర్త యితర స్త్రీలతో విలాసాలు గడిపీ, భార్య భర్తని తరుమూ ఎదిరించీ, సంసారంలో అనుమానాలూ కలతలు ఎక్కువయ్యే పరిస్థితులు సంభవించినప్పుడు, ఇంక ఆ యింట్లో పిల్లలకి సక్రమమైన శిక్షణ లభిస్తుందనుకోవటం పొరబాటు. దానికంటె విడాకులు పొందిన తండ్రిదగ్గరో తల్లిదగ్గరో శాంతిసౌఖ్యాలు లభించే వాతావరణంలో పెరగటం ఎంతో ఉత్తమమైనది. చట్టరీత్యా భార్యాభర్తలు విడాకులు పొందినా పొందకపోయినా, తల్లితండ్రుల మనఃక్లేశాలవల్ల నరకకూపంగా తయారయ్యే యిళ్ళలోని పిల్లల పరిస్థితి దుర్భరంగానే వుంటుంది. ఇటువంటిది విడాకులవల్ల కొత్తగా కలుగుతుందనుకోవటము కంటె, చాలామటుకు పిల్లల భవిష్యత్తు బాగుపడుతుందనే అనుకోవాలి.

ఇక పరస్పర అంగీకారంతో విడాకులు పుచ్చుకునే అవకాశం కల్పించటంలో అత్యాచార మేమిటో బోధపడటము లేదు. ఫ్రాన్సు, హంగరీ, జర్మనీలలో పరస్పర అంగీకారంపై విడాకులు పుచ్చుకునే అవకాశం వుంది. పాశ్చాత్యదేశాలలో కూడా విడాకులు పొందటం అంత సులభం కాదు. ఉదాహరణకి సోవియెట్ రష్యాలో ఇప్పుడు విడాకులు పుచ్చుకునేవారి సంఖ్య తక్కువ. చట్టరీత్యా విడాకులు పుచ్చుకునే అవకాశమున్నా, ఆచరణలో విడాకులు లభించటం సులువు కాకుండా చేశారు. అన్నివిధాలా విడాకులకి ఎగబడటం శ్రేయోదాయకం కాదనీ, దానివల్ల చిక్కులు కలుగుతాయనీ ప్రచారం చేశారు.

ఈ బిల్లు కేవలం ప్రజలను విడాకులు పుచ్చుకొమ్మని ప్రోత్సహించటానికి ప్రవేశ పెట్టబడిందనుకోవటం, పొరబాటు. భార్యాభర్తలు కలిసి వుండటం దుర్భరమైనప్పుడు, దొంగ సాక్ష్యాలు బనాయించి విడాకులు పుచ్చుకోవటం కంటె, పరస్పరం అంగీకరించుకొని విడిపోవటములో ఎంతో సుఖంవుంది. వారిద్దరూ శాంతి సౌఖ్యాలతో కాపురం చెయ్యగలిగే పరిస్థితులు తారుమారైనప్పుడు విడాకులు పొందే అవకాశం కల్పించడమే ఈ బిల్లుయొక్క ముఖ్యోద్దేశం. ఈ ఏర్పాటు అంధకారంలో మ్రగ్గిపోయే కొందరి స్త్రీలకు వెలుగుచూపిస్తుందనీ, మన సాంఘిక పరిణామంలో ఈబిల్లుని ప్రవేశ పెట్టడం ఒకడుగు ముందుకు వెయ్యటమే గాని వెనుకంజ కాదనీ ఒప్పుకోక తప్పదు. మనం ఎదుర్కొనే కొన్ని కష్టాలకు కర్మఫల మొక్కటే కారణం కాదనీ, అటువంటి పొరబాట్లని సరిదిద్దుకునే అవకాశం కల్పించడమే ఈ బిల్లుయొక్క ఆశయమనీ గ్రహించగలిగిన నాడు ఈ శాసనాన్ని హర్షించగలం. ★

ఇంటి పనుల్లో మునిగి ఉన్నారు. ఆయన గారు పెరట్లో కుర్చీ వేసుకుని ఏదో పుస్తకం చదువుకుంటున్నారు. అదే సమయ మను కున్నా. అడుగులో అడుగు వేసుకుంటూ వారి వెనకాలకు వెళ్లా. ముచ్చెమటలూ పోశాయి. నోట మాట రాలేదు. కడుపులో దుఃఖంకూడా ఆగడంలేదు. బలవంతంమీద "మీరు...మీరు......" అన్నాను. అంత కన్నా ఏమీ అనలేకపోయాను. ఏడుపు ఆగ లేదు. గట్టిగా ఏడిస్తే అమ్మావాళ్లు వింటా రని, నోట్లో పమిటచెంగు కుక్కుకుని నా గదిలోకి పారిపోయాను. వారిమీద కోప మంతా పోయేదాకా బాగా యేడ్చేశాను. అర్ధగంటకల్లా కొంత బాధ తగ్గింది. కాని అవమానం హెచ్చింది. ఆయన్ని "మీరు"